# బడదీదీ



శరచ్చంద్ర చటర్జీ

అనువాదం
'అరుణశ్రీ'




దేశికవితా మండలి
ఘంటశాల :: బెజవాడ

[redacted]

3

ఈ పృథివిలో ఒకరకం మనుష్యులున్నారు – వాళ్ళు రెల్లుగడ్డిలాంటివాళ్ళు. గప్‌మని మండనూవచ్చు, చప్పగా చల్లారిపోనూ వచ్చు. వాళ్ళ వెనకాల సర్వదా ఓ మనిషి మాత్రం ఉంటూఉండాలి–అవసరాన్ననుసరించి గడ్డివేస్తూ ఉండటానికి.

ఆడవాళ్లు దీపారాధన చేసేటప్పుడు ప్రమిదలో నూనె, వత్తితోపాటు ప్రమిదలో ఒక పూచికపుల్లకూడా వేస్తారు. ఆ దీపశిఖ తగ్గిపోతున్నప్పుడు ఈ పనికిమాలిన పుల్ల ఎంతైనా అవసరం-ఎగతోయడానికి. అలాచేయకపోతే నూనే వత్తీ ఉన్నప్పటికీ దీపం వెలగదు.

సురేంద్రనాథుడి స్వభావంకూడా చాలావరకు ఇలాంటిదే. అతడికి బలమూ, బుద్ధీ, విశ్వాసమూ అన్నీ ఉన్నాయి. అయినా అతడేపనినీ సంపూర్ణంగా నిర్వహించలేడు. కొంత పనిని అతడెంతఉత్సాహంగా చేస్తాడో, మిగిలినదానిని అంత అశ్రద్ధగా వదిలేసి మెదలకుండా కూర్చుంటాడు. అప్పుడే ఒకమనిషి అవసరం; అతడ్ని పురికొల్పటానికి.

సురేంద్రుడి తండ్రి పడమటదేశంలో ఒక వకీలు. వంగదేశంతో అతడికంతగా సంబంధమేమీలేదు. ఇక్కడే సురేంద్రుడు తన ఇరవయ్యోయేట ఎం. ఏ. ప్యాసయినాడు—కొంత తన శక్తివల్లా, కొంత సవితితల్లి ప్రోత్సాహంవల్లా. ఇలా సవితితల్లి ఇంత ప్రోద్బలం కలిగిస్తూ అతడివెంట అంటిపెట్టుకుని ఉన్నప్పటికీ, తనకేదైనా స్వాధీనతా బలం ఉన్నదా, లేదా, అన్నసంగతి అతడు చాలాసార్లు తెలుసుకోలేకపోయేవాడు. సురేంద్రుడంటూ ఓ స్వతంత్రజీవి జగత్తులో ఉన్నాడా అంటే లేదు. ఈ సవితితల్లి వాంఛలే ఒక మనుష్యరూపాన్ని ధరించి, పనిపాటలూ, చదువుసంధ్యలూ తిండితిప్పలూ, పరీక్షలు ప్యాసవడమూ మొదలైనవన్నీ నిర్వర్తిస్తున్నాయి. ఈ సవితితల్లి తన సంతానం విషయంలో కొంతఉదాసీనంగా ఉన్నప్పటికీ, సురేంద్రుణ్ని అంతులేనంత అదుపులో పెట్టుతూఉండేది. అతడు ఉమ్మివేయటంకూడా ఆమె దృష్టిని అతిక్రమించి జరిగేదికాదు. ఈ కర్తవ్య పరాయణురాలైన స్త్రీ ఆజ్ఞలో ఉండి, సురేంద్రుడు చదువు సంధ్యలు నేర్చుకున్నాడు. కాని తనమీద తాను ఆధారపడి ఉండటాన్ని మాత్రం నేర్చుకోలేదు. తనమీద తనకు విశ్వాసంలేదు. ఏపనీ సర్వాంగసుందరంగా తనవల్ల నెరవేరుతుందనే విశ్వాసంకూడా లేదతడికి. ఎప్పుడు తనకేది అవసరమో, తనెప్పుడు ఏంచెయ్యాలో - సంపూర్ణంగా మరొకరిమీద ఆధారపడి ఉండేవాడు. నిద్రవస్తున్నదో, ఆకలివేస్తున్నదో – చాలా సమయాల్లో ఇదికూడా నిర్ణయించుకోలేకపోయేవాడు. జ్ఞానం వచ్చినప్పటినుంచి, సవతితల్లి మీదనే

ఆధారపడి, ఈ పదిహేనేళ్లూ గడిపివేశాడు. కేవలం సవితి తల్లి అతడికి ఎన్నో పనులు చేసిపెట్టుతూ ఉండాలి. ఇరవై నాలుగు గంటల్లోనూ, ఇరవై రెండుగంటలు, తిరస్కార మూ, అనురాగమూ, తిట్లూ, దీవెనలూ, మూతివిరుపులు ఎన్ని ఉన్నా, అదికాకుండా, పరీక్ష ఇంకా ఏ సంవత్సరమో ముందుఉందనగా రాత్రిఅంతా మేలుకొని ఉండటానికి ఆమె నిద్రాసుఖంకూడా త్యజించవలసి ఉండేది. సవితిబిడ్డ విష యమై ఎవరిలా ఉంటారు! ఇరుగుపొరుగువారు ఐక్య కం ఠంతో ఆమెను మెచ్చుకునేవారు.

సురేంద్రుడిమీద ఆమెకున్న ఆంతరంగిక ప్రేమలో లోపంలేదు. తిరస్కారాలు దీవెనలూ అయాక అతడి కళ్ళ వెంట నీళ్లుకారితే అది జ్వరానికి పూర్వలక్షణమని ఆమె గ్రహించి, మూడురోజులవరకు అతడికి సగ్గుబియ్యం జావ చేసి ఇచ్చేది. మానసిక ఔన్నత్యం విషయంలోనూ, విద్యా విషయంలోనూ ఆమెదృష్టి మరీ తీవ్రంగాఉండేది. సురేం ద్రుడిశరీరంమీద శుభ్రమైనవికాని, ఆధునిక అభిరుచుల కనుగుణంగా ఉండేవికాని, బట్టలు కనపడగానే అతడికి షోకు లెక్కువవు తున్నాయని ఆమె నిశ్చయించుకుని, రెండు మూడు వారాలవరకు సురేంద్రుడి బట్టలు చాకలి ఇంటికి పోకుండా ఉండేఏర్పాట్లు వెంటనేచేసేది.

సురేంద్రుడికి రోజులు ఈవిధంగానే గడిచిపోతున్నాయి. ఇలాంటి ప్రేమపూర్వకమైన అదుపుఆజ్ఞలో పెరుగుతూ ఉండటం వల్ల మధ్యమధ్య అప్పుడప్పుడు జీవితంమీద నిస్పృహకలిగేదతడికి. ఒక్కొక్కప్పుడు అందరి జీవితాలూ

ఇలాగే గడిచిపోతున్నాయేమో అనిపించేది. కాని, ఒక్కొక్కరోజున ప్రక్కనుండే స్నేహితులు వచ్చి అతడి బుర్రలోకి విభిన్నమైన ఊహాల్ని ఎక్కించి వెళ్ళేవారు.

ఒకరోజున అలాగేఅయింది. ఒక స్నేహితుడువచ్చి నీ లాంటి తెలివైన కుర్రాడు విదేశాలకు వెళ్ళితే భవిష్యత్తులో ఎంతో ఉన్నతి పొందటానికి అవకాశం ఉందనీ – స్వదేశానికి తిరిగివచ్చాక ఎంతోమందికి ఎన్నో ఉపకారాలు చేయ వచ్చుననీ సలహా ఇచ్చాడు. ఈ మాట అతడికి నచ్చకపో లేదు. వనంలో ఉండే పక్షికన్న పంజరంలో ఉండే పక్షే ఎక్కు వ కొట్టుకుంటుంది. సురేంద్రుడు ఊహాదృష్టితో స్వేచ్ఛా వాయువును, స్వాధీనతాప్రకాశాన్ని చూడగలిగాడు. అం దుకే అతడి పరాధీన ప్రాణం ఉన్మత్తుడిలాగా పంజరంలో నాలుగువైపులా తిరుగుతూ రెపరెప కొట్టుకోసాగింది.

అతడు తండ్రిదగ్గరకు వెళ్ళి తనను విదేశాలకు పంపించే ఏర్పాట్లు చేసిపెట్టండని కోరాడు. దానివల్ల ఉచ్ఛస్థితిలోకి రాగల అవకాశాలేవయితే ఉన్నాయో అదికూడా చెప్పాడు. 'ఆలోచిస్తా'నని చెప్పాడు తండ్రి. కాని గృహిణి అభిప్రాయం పూర్తిగా ప్రతికూలంగా ఉంది. ఆమె తండ్రికొడుకుల మధ్య కు తుపానులా వచ్చిపడి అట్టహాసం చేసేసరికి ఇద్దరూ స్తబ్ధ లయ్యారు.

"అయితే నన్నుకూడా విదేశాలకు పంపండి. లేకపోతే సురోను ఎవరు కనిపెట్టుకుంటారు? తిండి ఎప్పుడు తినాలో, బట్ట ఎలాకట్టుకోవాలో తెలియదు వాడికి. అలాంటివాణ్ణి ఒకంగా విదేశాలకేపంపుతారా? ఇంట్లో గుర్రాన్ని అక్కడికి

పంపితే ఎంతో వాణ్ణి పంపినా అంతే గుర్రం తనకి ఆకలి అవుతున్నదో, నిద్రవస్తున్నదో అయినా తెలుసుకుంటుంది— మీ 'సురో' ఇదికూడా తెలుసుకోలేదు" అంటూ మళ్ళీ నవ్వింది.

విపరీతంగా నవ్వటంచూసి రాయ్ మహాశయుడు అతి లజ్జితుడైనాడు. సురేంద్రుడుకూడా ఖండించటానికి వీలు లేని ఈ యుక్తికి భిన్నంగా ఏవిధంగానూ ప్రతివాదం చెయ్యలేమని అనుకుని, విదేశాలకు వెళ్ళాలనే ఆశను త్యజించాడు. అతడి స్నేహితుడీ సంగతిని చాలా విచారిస్తాడు. కాని విదేశాలను వెళ్ళేందుకు మరో ఉపాయం ఏదైనా ఉన్నదీ లేనిదీ చెప్పలేకపోయాడు. కాని చివరికి "ఇలా పరాధీనంగా పడి ఉండటంకన్న బిచ్చమెత్తుకోవటం మంచిది. అయినా ఇలా నీలాగా యుమ్మెల్యే పాసయినవాడు పొట్టకోసం అలా అవస్థపడాల్సిన అవసరం ఉండదు" అన్నాడు.

సురేంద్రుడు ఇంటికివచ్చి ఈ సంగతే ఆలోచిస్తూ కూర్చున్నాడు. అతడు ఆలోచించి సంతసించాడు - స్నేహితుడు చెప్పినది నిజమే - బిచ్చమెత్తుకుని తినటమే మంచిది. అంతా విదేశాలకు వెళ్ళలేరు. కాని ఇలా చావకుండా బ్రతుకూ కాకుండా రోజులు గడపలేము.' అని తోచింది.

ఒకరోజున అర్ధరాత్రి అతడు స్టేషన్కువచ్చి, కలకత్తా టిక్కెట్ కొనుక్కుని రైల్లో కూర్చున్నాడు - కొన్నాళ్ళపాటు తాను ఇల్లు వదలిపెట్టాలనీ, అనవసరంగా వెతకటం వల్ల విశేషించి ప్రయోజనమేమీ ఉండదనీ, ఒకవేళ వెలికినా

మళ్ళీ ఈ ఇంటికి తిరిగివస్తాననే ఆలోచన పెట్టుకోవద్దనీ, తండ్రికి ఒక ఉత్తరంరాసి పోస్టులోపడేశాడు.

రాయ్ మహాశయుడు భార్యకి ఉత్తరం చూపించాడు. "సురో ఇప్పుడు మనిషి అయ్యాడు. చదువుకున్నాడు. రెక్కలు వచ్చాయి — ఇప్పుడెగిరిపోకపోతే ఇంకెప్పు డెగిరి పోతాడు!" అన్నదామె.

అయినా ఆయన వెదికించాడు. కలకత్తాలో ఉన్న పరిచితులకందరికీ ఉత్తరాలు రాశాడు. కాని ప్రయోజనం లేక పోయింది. సురేంద్రుడిపత్తా ఏమీ తెలియలేదు.

౨

జనసమ్మర్దంగా ఉండే కలకత్తా రాజవీధిలో ప్రవేశించాక సురేంద్రుడు తన పొరబాటును తెలుసుకున్నాడు. ఇక్కడ తనను తిరస్కరించేవాళ్ళూ లేరు. రాత్రింబగళ్లు తనని అమపాజల్లో ఉంచాలనీ ఎవరూ అనుకోరు. ముఖం వాడిపోయినా తనకేసి ఎవరూ తిరిగి చూడలా. ముఖం విచారగ్రస్తంగా ఉన్నా ఎవరూ లక్ష్యపెట్టలేదు. ఇక్కడ తన సంగతేదో తనే చూసుకోవాలి. ఇక్కడ బిచ్చమూ దొరుకుతుంది, కరుణకీ స్థానముంది, ఆశ్రయమూలభిస్తుంది కాని తాను ప్రయత్నించాలి. ఎవరూ తమంతట తాము రెక్కలు విదుల్చుకుంటూ వచ్చి తన విషయమై పట్టించుకోరు.

తనంతట తాను భోజనంకోసం ప్రయత్నించాలనీ, ఆశ్రయస్థానం తనంతట తాను వెతుక్కోవాలనీ-నిద్రకూ, భోజనానికీ మధ్యను స్వల్పభేదం ఉన్నదనీ, ఇవన్నీ ఇక్కడకు వచ్చాకనే అతడు మొదటిసారిగా తెలుసుకున్నాడు.

అతడు ఇల్లు విడిచిపెట్టి కొన్నాళ్ళయింది. వీధులన్నీ చాంద్రాయణం తిరిగేసరికి శరీరం చాలా అలిసిపోయింది. డబ్బుకూడా అంతా ఖర్చయిపోయింది. గుడ్డలన్నీ మాసి చిరిగిపోవటం ప్రారంభమైనాయి. రాత్రిళ్ళు పడుకోవటానికి కూడా ఎక్కడా ఆశ్రయం లేదు. సురేంద్రుడికి కళ్ళువెంబడి నీళ్ళు వచ్చాయి. ఇంటికి ఉత్తరం రాయటానికి కూడా మనస్కరించలా; చాలా సిగ్గేసింది. అన్నిటికన్నా మించి, స్నేహకరిమైన సవితితల్లి ముఖం జ్ఞాపకం వచ్చేసరికి, ఇంటికి వెళ్ళాలనే వాంఛ ఒక్కసారిగా ఆకాశమంత మందిగా అగపడేది అక్కడ తాను ఒకప్పుడు ఉన్నానని సంగతి తలపుకు వచ్చినా భయంవేసేది.

ఒకరోజున అతడు తనలాంటి ఒక దరిద్రుడుదగ్గరకే వెళ్ళి 'నువ్విక్కడ తిండి ఎలా తింటున్నావు బాబూ?' అని ప్రశ్నించాడు.

ఆ వ్యక్తి కొంచెం దేబెమొహం. లేకపోతే ఎగతాళి చేసేవాడు! 'నౌకరీచేసుకుని మెస్సులో తింటూఉంటాను. కలకత్తాలో సంపాదనకేం?' అన్నాడు.

'నాకుకూడా ఒక నౌకరీ చూపించిపెడతావా?' అన్నాడు సురేంద్రుడు.

'నీకేం పని చేతొచ్చు?'

సురేంద్రనాథుడు ఏపనీ ఎరగడు. అంచేత మెదలకుండా ఆలోచించటం మొదలెట్టాడు.

'నువ్వు ఉత్తమ వంశస్థుడివా?'

సురేంద్రుడు తల ఆడించాడు.

'అయితే చదువెందుకు నేర్చుకోలేదు?'

'నేర్చుకున్నా'

ఆ వ్యక్తి రవంత ఆలోచించి, 'అయితే ఈ భవనంలోకి వెళ్ళు. ఆ ఇంట్లో పెద్ద జమీందారు ఉంటాడు. ఏదో పని ఇస్తాడు' అని చెప్పి వెళ్ళిపోయాడు.

సురేంద్రుడు గేటు దగ్గిరకు వచ్చి నిలబడ్డాడు. మళ్ళీ వెనక్కి వెళ్లాడు. మళ్లీ తిరిగి ముందుకు వచ్చాడు. మళ్లీ వెనక్కి వెళ్ళాడు. ఆరోజున ఇంకేమీ చేయలా. మర్నాడు కూడా ఇలాగే గడిపేశాడు. రెండురోజులు ఇలాగే గేటు దగ్గిరకు వచ్చి ప్రతీక్షించి, మూడోరోజున కొంత సాహసాన్ని సమకూర్చుకుని, లోపల ప్రవేశించాడు. ఎదురుగా నిలబడిఉన్న బంట్రోతు 'ఏంకావాలి?' అని అడిగాడు.

'బాబుగారు—'

'బాబుగారింట్లో లేరు.'

సురేంద్రుడి హృదయం ఆనందంతో వెల్లివిరిసింది. ఒక మహాకార్యనుంచి అతడు విముక్తుడైనాడు. బాబుగారింట్లో లేరు! తన నౌకరీ విషయం, తన దుఃఖగాథా వినిపించ నవసరం లేదు. ఇదే అతడి ఆనందానికి హేతువు. అప్పుడిహా ద్విగుణీకృతోత్సాహంతో వెనక్కిమరలాడు. దుకాణంలోకి వచ్చి కూర్చుని కడుపునిండాతిని, కొంతసేపు ఆనందవీధుల్లో

తిరిగితిరిగి, మన్నాడు తనవిషయం చెప్పటానికి ఎలా ఉపక్ర మించాలా అని ఆలోచించటం మొదలెట్టాడు.

కాని మన్నాడు అతనికి ఉత్సాహం అంతగాలేదు. ఇల్లు దగ్గరకు వచ్చినకొద్దీ, తిరిగిపోదామనే వాంఛ ప్రబలం కాసా గింది. గేటుదగ్గిరకువచ్చి హఠాత్తుగా ఆగిపోయాడు. లోప లకు అడుగు పెట్టడానికి కాళ్ళు ఏమాత్రం అంగీకరించలా. తాను తనపని కోసమే వచ్చినట్లు అతడికేమాత్రం అని పించలా - ఎవరో బలవంతంగా తనను పంపారని తోచింది. కాని ద్వారందగ్గిర ఆట్టేసేపు ప్రతీక్షిస్తూఉండలేక లోపలకు వెళ్ళాడు. మళ్ళీ ఆ బంట్రోతే కనిపించి 'బాబుగారు ఇంట్లో ఉన్నారు. చూస్తారా?' అని అడిగాడు.

'ఆఁ.'

'అయితే పదండి.'

ఈ వెళ్ళటం ఇంకా కష్టం. జమీందారుగారిది చాలా పెద్దఇల్లు. పాశ్చాత్య పద్ధతిని అలంకృతమైఉంది ఫర్నిచరు. గదుల నానుకుని గదులు, పాలరాళ్ళు పరచిన మేడమెట్లు, హాల్లో వ్రేలాడుతూ పెద్దలైట్లున్నాను. ఎర్రటి తివాసీలతో గదులన్నీ శోభావంతంగా ఉన్నాయి. గోడలకు కొన్ని పెద్ద పెద్ద ఫొటోలు అమర్చిఉన్నాయి. ఇవిఅన్నీ ఇతరుల కేలా ఉన్నా, సురేంద్రుడికి మాత్రం కొత్తకాదు. కారణమేమి టంటే ఆతడి తండ్రి ఇల్లుకూడా కేవలం దరిద్రుడి చుట్టు గుడిసెకాదు. అదీగాక ఏమయినా అతడైనా దరిద్రుడైన తండ్రి ఆశ్రయంలో ఇంత పెరిగి పెద్దకాలేదు. సురేంద్రుడు ఆలోచిస్తున్నది - తాను చూడవలసిన వ్యక్తిదగ్గర అను

నయవినయాలు ఎలా చూపించాలా అని...ఆయన ప్రశ్నిస్తే తాను ఏమి సమాధానం చెప్పాలా అని...

కాని ఇహ ఆలోచించటానికి అవకాశం లేకపోయింది. ఆ యజమాని ఎదురుగానే కూర్చుని ఉన్నాడు. 'నీకు కావలసిన పని ఏమిటి?' అని ప్రశ్నించాడు సురేంద్రనాథుణ్ణి.

ఇవ్వాల్టికి మూడురోజుల్నుంచీ సురేంద్రుడీ విషయమే ఆలోచిస్తున్నాడు కాని ఇప్పుడుమాత్రం అంతా మరిచిపోయి 'నేను - నేను -' అన్నాడు.

వ్రజరాజలాహిరీ వయసు చెల్లిన జమీందారు. తల వెంట్రుకలు నెరిసిపోయాయి. అకాలంలో నెరవటంకాదు. సరియైన వయసులోనే నెరిశాయి. ధనవంతుడు. ఎంతో ప్రపంచం చూశాడు—అంచేతనే చటుక్కున సురేంద్రుడ్ని చాలా భాగం అర్ధం చేసుకుని, 'ఆఁ. నీకేం కావాలి బాబూ?' అని అడిగాడు.

'ఏదో ఒక -'

'-ఉద్యోగం'

వ్రజరాజబాబు మృదువుగా నవ్వి. 'నేను ఉద్యోగం ఇస్తానన్న సంగతి ఎవరు చెప్పారు?' అన్నాడు.

'దారిలో ఒకమనిషి కనపడితే అడిగాను నేను. అతడే తమ విషయం -'

'మంచిది. మీ ఇల్లు ఎక్కడ?'

'పశ్చిమ దేశంలో.'

'అక్కడెవరున్నారు?'

'సురేంద్రుడు సంగతి యావత్తూ చెప్పాడు.'

మీ నాన్నగారు ఏంచేస్తూఉంటారు?'

పరిస్థితి మార్పువల్ల సురేంద్రుడు ఒక కొత్తపద్ధతికి అలవాటయ్యాడు. కొంచెం నసిగి, నసిగి, 'సామాన్యమైన నౌకరి' అన్నాడు.

'దానితో జరుగుబాటు లేక నువ్వుకూడా సంపాయించాలని ప్రయత్నిస్తున్నావా?'

'ఆఁ'

'ఇక్కడెక్కడుంటున్నావు?'

'ఒక నిర్దిష్టమైన ప్రదేశమంటూ లేదు – ఇక్కడా, అక్కడా'

వ్రజబాబుకు జాలివేసింది. సురేంద్రుణ్ణి దగ్గరగా కూర్చోపెట్టుకుని, 'నువ్వింకా కుర్రవాడివి. ఈ వయస్సులోనే ఇల్లువిడిచి రావలసిన బాధ్యత మీదపడిందంటే నాకు చాలా కష్టంగాఉంది. నే నేమీ స్వయంగా అయితే ఉద్యోగం చూపించలేను కాని, ఏదైనా ఒకటి దొరికే ఉపాయం మాత్రం చూపించగలను' అన్నాడు.

'సరే' అని సురేంద్రనాథుడు బయలుదేరాడు. వ్రజబాబు అతణ్ణి వెనక్కి పిలిచి, 'ఇంక నువ్వేమీ అడిగేది లేదా?' అని అడిగాడు.

'లేదు'

'ఇంతటితోనే నీపని అయిపోయిందా? ఏ సదుపాయం చేస్తానో - ఎప్పుడు చేయగలనో ఏమీ అడగవలసిన అవసరం లేదా?'

సురేంద్రుడు నిర్విణ్ణుడయి వెనక్కితిరిగి నుంచున్నాడు.

వ్రజబాబు నవ్వుతూ 'ఇప్పుడెక్కడికి వెడతావు?' అని అడిగాడు.

'ఏదో ఒక దుకాణానికి'

'అక్కడే భోజనం చేస్తావా?'

'రోజూ అలాగే చేస్తున్నాను'

'నువ్వు ఎంతవరకు చదువుకున్నావు?'

'ఏదో కొంచెం'

'మా అబ్బాయికి చదువు చెబుతావా?'

సురేంద్రుడు సంతోషంతో 'చెబుతాను' అన్నాడు.

వ్రజబాబు ఈసారికూడా నవ్వాడు. కష్టాలు, దారిద్ర్యంమూలంగా అతడి మెదడు సరీగ్గా పని చెయ్యటం లేదనుకున్నాడు. ఎవరికి చెప్పాలో, ఏం నేర్పాలో ఈ సంగతి తెలుసుకోకుండానే, అంత సంతోషించటాన్ని బట్టి అతడిలో కొంత పిచ్చి ఉందని తోచింది.

'ఒకవేళ వాడు బి. ఏ. చదువుతుంటే నువ్వెలా చెప్పగలవు?' అన్నాడు.

సురేంద్రుడు కొంచెం గంభీరంగా ఆలోచించి 'ఏదోవిధంగా చెబుతాను' అన్నాడు.

వ్రజబాబు ఇంకేమీ మాట్లాడలా. నౌకర్ని పిలిచి, బంకూ ఈ బాబుగారికెక్కడ ఉండేందుకు ఏర్పాట్లుచెయ్యి, స్నాన భోజనాలకు కూడా సదుపాయాలు చూడు. , అని చెప్పాడు. తర్వాత సురేంద్రుడికేసి చూసి, 'సాయంత్రమయింతర్వాత నేను కబురుపంపిస్తాను - నువ్వు మా ఇంట్లోనే ఉండు. ఉద్యోగం దొరికసంతవరకూ మా ఇంట్లోనే

ఉండవచ్చు' అన్నాడు.

మధ్యాహ్నం భోజనం చేసి ఆయన పెద్దకుమార్తె మాధవిని పిలిచి, 'అమ్మా! ఒక దీనుడికి మన ఇంట్లో ఆశ్రయమిచ్చానమ్మా!' అని చెప్పాడు.

'ఎవరు నాన్నా?'

'ఒక దీనుడు. అంతకన్న ఇంకేమీ తెలియదు. కొంచెం చదువుకున్నవాడని తోస్తుంది. మీ అన్నయ్యకు చదువు చెప్పాలంటే అందుకు కూడా ఒప్పుకున్నాడు. బి.ఏ. చదువుతున్న కుర్రవాడికి చదువు చెప్పటానికి సాహసించాడంటే, కనీసం నీ చిన్న చెల్లెలికైనా అతడు నిశ్చయంగా చదువు చెప్పగలడు. ప్రమీలకు మాష్టరుగా అతణ్నే ఉంచాలనుకున్నాను'

మాధవి అభ్యంతరం చెప్పలేదు.

సాయంకాలం అతణ్ణి పిలిపించి వ్రజబాబు అసంగతే చెప్పాడు. మర్నాటినుంచీ సురేంద్రనాథ్ ప్రమీలకు చదువుచెప్పటం మొదలెట్టాడు.

ప్రమీలకు ఏడోఏడు. మొదటిపుస్తకం చదువుతోంది. పెద్దఅక్క మాధవిదగ్గర మొదటిపుస్తకంలో 'కప్ప' కథ వరకు చదువుకుంది. ఆ పిల్ల పుస్తకాలు, పలక, బలపం, పెన్సిల్, బొమ్మలూ, చాక్‌లెట్లూ మొదలైనవన్నీ తెచ్చుకుని, చదవటానికి కూర్చుంది.

Do not move - కదలవద్దు. అని చెప్పాడు సురేంద్రుడు.

Do not move - కదలవద్దు - అని చదవటం మొద

లెట్టేది ప్రమీల. తర్వాత పరధ్యానంగా సురేంద్రుడు పలకాబలపం తీసుకుని లెక్కలు వేస్తూకూర్చున్నాడు.

ప్రాబ్లంమీద ప్రాబ్లం సాల్వ్అవుతోంది. గడియారం ఏడు, ఎనిమిది, తొమ్మిది కొడుతోంది. ప్రమీల కాస్సేపు అటూ ఇటూ జరిగి, బొమ్మలపుస్తకం తిరగవేస్తూన్నా కాస్సేపు పడుకునీ, కాస్సేపు కూర్చునీ, కాస్సేపు చాక్లెట్లు చప్పరిస్తూ, కప్పబొమ్మమీద సిరాపులుముతూనూ; Do not move — కదలవద్దు అని చనువుతూ; మాస్టరుగారూ! ఇంట్లోకి వెళ్లనా?' అని అడిగింది.

'వెళ్ళు'

ప్రొద్దున పూటల్లా ఇలాగే గడిచేది. కాని మధ్యాహ్నం గడిచే తీరు వేరు. ఉద్యోగం దొరికే విధానాన్ని ఆలోచించి వ్రజబాబు ఇద్దరుముగ్గురు పెద్దమనుష్యులపేర ఉత్తరాలు వ్రాసియిచ్చి పంపుతూ ఉండేవాడు. సురేంద్రుడు అవన్నీ జేబులో పెట్టుకుని వీధిలోకి వెళ్లిపోయేవాడు. వెతికి వెతికి వాళ్ల ఇళ్ళదగ్గరకువెళ్లి — అది ఎంత పెద్దఇల్లో బైటికి ఎన్ని వాకిళ్ళున్నాయో, ఎన్ని కిటికీలో, రెండంతస్తులో, మూడంతసులో, ఎదురుగా ఏదైనాఎలక్ట్రిక్ స్తంభం ఉందో లేదో, తేరిపారచూసి, చివరకు చీకటిపడకముందే ఇంటికి వచ్చేవాడు.

కలకత్తా వచ్చాక అతడు కొన్నిపుస్తకాలు కొన్నాడు. ఇంటినుంచి వచ్చేప్పుడు కొన్ని పుస్తకాలు తీసుకుని వచ్చాడు. ఇక్కడ ఆ పుస్తకాలన్నీ ఎలక్ట్రిక్ లైటు ముందర చదువుతూ ఉండేవాడు. వ్రజబాబు ఉద్యోగం

విషయం ప్రశ్నిస్తే, మొదలకుండానైనా ఊరుకునేవాడు. లేదా ఆ పెద్దమనుష్యుల దర్శనం కాలేదనైనా చెప్పేవాడు.

## 3

వ్రజబాబుకు పత్నీవియోగం సంభవించి నాలుగేళ్లయింది. ముసలితనంలోని ఈ దుఃఖం ముసలివాళ్లకే తెలియాలి. కాని ఆసంగతి అలాఉంచగా. ఆయన ప్రియపుత్రిక మాధవీదేవి పదహారో ఏటనే భర్తను పోగొట్టుకున్నది. ఈ సంఘటన వ్రజబాబుశరీరంలో సగంకన్నా పీల్చేసింది. ఎంతో ఉత్సాహంతో బ్రహ్మాండంగా చేశాడాయన ఈ కుమార్తెవివాహం. ఆయనకుచాలాడబ్బుఉంది. అంచేత ధనంమీాద లేదాయనదృష్టి పిల్లవాడికి ఆస్తిపాస్తులున్నాయా అని చూడలేదు, కుర్రవాడు చదువుకున్నాడు. రూపసి, మంచివాడు, బుద్ధిమంతుడని చూసే ఆయన మాధవి పెళ్లి చేశాడు.

పదకొండేళ్లప్పుడయింది మాధవికి పెళ్లి. మూాడు సంవత్సరాలు ఆమెభర్తదగ్గరఉంది. ప్రేమ, స్నేహం, ఆదరమూ ఇంతింతని లేదు.

కాని యోగేంద్రనాథుడు బ్రతకలేదు. మాధవికి ఈ జీవితంలోని వాంఛలన్నీ తుడిచేసి, వ్రజబాబు వక్షంలో శూలాన్నిగుచ్చి అతడు స్వర్గవాసిఅయినాడు. చనిపోయే ముందు మాధవి ఏడవటం ప్రారంభిస్తే - అతడు మృదు

కంఠంతో, "నిన్ను ఇలావిడిచిపెట్టి పొడుతున్నాననే నాకు చాలా దుఃఖంగాఉంది. చనిపోవటంవల్ల వచ్చిననష్టమేమీ లేదు. కాని జీవితాంతం నువ్వుక్లేశాన్ని పొందుతావనేదే నన్నుచాలా విచలితుణ్ణి చేస్తోంది. నేనునిన్ను ఆదరించలేక పోయాను!." అని ఊరడించాడు.

పొంగిపొరలిన అశ్రుప్రవాహం. యోగీంద్రుని శీర్ణవక్షస్థలంమీద ప్రవహించసాగింది. మాధవి ఆ అశ్రువులను తుడిచేసి, "ఈసారి మీపాదసన్నిధికి వచ్చినప్పుడు ఆదరింతురుగాని_" అన్నది.

"నాసుఖంకోసమని అర్పించిన నీజీవితాన్ని, సర్వజనుల సుఖానికి అర్పించు. కష్టాలతో దీనంగా కనిపించిన ముఖాల్ని ప్రఫుల్లంగా చేయటానికి ప్రయత్నించు. ఇంకేం చెప్పను మాధవీ!_మళ్లీ అశ్రువులు ప్రవహించసాగాయి_ మాధవి వాటిని తుడుస్తూ కూర్చుంది.

"సన్మార్గంలో ఉండు_నీపుణ్యంవల్ల నేమళ్లీనిన్ను పొందుతాను" అప్పటి నుంచీ మాధవి సంపూర్ణంగా మారిపోయింది. ఆమెకు క్రోధం, హింసా, ద్వేషం మొదలైన వేవయినా ఉన్నా అవన్నీ భర్త అస్థికలతోపాటు ఈజన్మకింక గంగలో కలిపేసింది. ఈ జీవితంలో ఎన్నో కోరికలు! ఎన్నో కాంక్షలు! విధవ అయినా అవన్నీ పోకపోయినప్పటికీ-భర్త చెప్పిన మాటలే జ్ఞాపకం తెచ్చుకునేది. అతడే లేనప్పుడు ఇంక అవన్నీ ఎందుకు ? ఎవరికోసం ఇంకా ఇతరుల్ని హింసించటం ? ఎవరికోసం ఇంక ఇతరులనే త్రిల్లునించి అశ్రువుల్ని ప్రవహింపచెయ్యాలి ? అసలీ

హీనప్రవృత్తి ఆమెకెప్పుడూ లేదు. - ఘరానాఇంటిపడుచు ఆమెకీకోరికలూ, ఏకాంక్షలు, నెరవేరనివంటూ లేవు. హింసాద్వేషాలు ఆమెఎన్నడూ నేర్చుకోనేలేదు.

ఆమెహృదయంలో అనేక పుష్పాలు వికసించేవి. పూర్వం ఆపూలన్నీ దండలు గుచ్చి భర్తమెడలో వేస్తూ ఉండేది. ఇప్పుడు భర్తలేదు. అలాఅని తన హృదయో ద్యానంలోని, పూలచెట్లనన్నీ ఆమె కొట్టివేయలేదు. ఇప్పుడూ వాటినుంచి అన్నిపూలూ వికసించి రాలిపోతు న్నాయి. ఇప్పుడు వాటినన్నీ దండలు గుచ్చటని మాట నిజమే. కాని వాటిని గుత్తులుగా అమర్చి, దోసిళ్లకొద్ది, దీనులకీ, దుఃఖితులకీ పంచిపెడుతోంది. లేనివారికల్లా ఇస్తోంది. కొంచమైనా కృపణత్వంలేదు కొంచమైనా మూతి విరుచుకోవటంలేదు.

విపినబాబు భార్యా పరలోకగతురాలైనప్పటి నుంచీ, ఈ సంసారంలో క్రమపద్ధతి అనేదిలేదు. అంతా తమతమ గొడవల్లో ఉండేవారు. ఒకరివిషయం ఒకరు చూచుకునేవారుకారు. ఒకరికొకరు సహాయపడేవారు కాదు. అందరికీ ఎవరి నౌకర్లు వారికిఉండేవారు. వాళ్లె వాళ్ల యజమానులపనులు చేస్తూఉండేవారు. మహాన సంలో వంటవాడు వంటచేసేవాడు. పెద్ద అన్నసత్రంలో మాదిరిగా అందరికి విస్తళ్లువేసి వడ్డించేవాడు. ఎవరుతి న్నారో, ఎవరుతినలేదో, ఎవరుఅడిగేవారుకాదు. చూసే వారుకాదు

కాని భాద్రపదమాసంలో నిండు ప్రవాహంతో

ఉన్న గంగానదిలాగా, స్నేహ, మమతా సౌందర్యాలతో పరిపూర్ణురాలైన మాధవి తిరిగి తండ్రి ఇంటికివచ్చినప్పటి నుంచీ, ఆ సంసారములోకి మళ్లీ నూత్న వసంతం వచ్చింది. ఇప్పుడంతా పెద్దక్కా అనేవాళ్లే. అంతా మాధవీ అనే వాళ్లే. ఇంట్లో పెంపుడు కుక్కకూడా సాయంకాలం ఒక్కసారి పెద్దక్కను చూడాలనే కోరేది. వీళ్లందరిమధ్యా ఆమె ఒక్కతే స్నేహమయిగానూ, సర్వమయిగానూ ఉంటూ ఉండేది. ఇంటి యజమాని దగ్గర్నుంచీ, గుమాస్తా దాసదాసీలవరకూ అంతా పెద్దక్కమాట తలచేవారే. అంతా ఆమెమీద ఆధారపడి ఉండేవారు. కారణంఏమయినాకాని, ఈ పెద్దక్కమీద తమకుకాస్త విశేషమైన హక్కు ఉన్నదని అంతా మనస్సులో అనుకునేవారు.

స్వర్గంలో ఉన్న కల్పవృక్షాన్ని ఎవ్వరూచూడలా ఎప్పుడైనా చూస్తామేమోకూడా చెప్పలేము. కాని ఈ వ్రిజబాబు కుటుంబంలోని వారంతా ఒక కల్పవృక్షాన్ని పొందగలిగారు కిందకివెళ్లి చెయ్యిచాచేవారు. నవ్వు ముఖంతో తిరిగి వచ్చేవారు. ఇలాంటి కుటుంబములో సురేంద్రనాథుడు ఒక కొత్తపద్ధతి జీవితాన్ని గడపటం ప్రారంభించాడు. అంతా ఒక వ్యక్తిమీద భారంవేయటం మొదలిడినట్లే. తానుకూడా ఆ అందరిలాగానే చేయటం సాగించాడు. కాని ఇతరులకన్న ఆతడిదికొంచెం భిన్నమైన పద్ధతి. బడదీది అని ఒక జీవపదార్థం ఇంట్లోఉంది, అంద రీని చూస్తు ఉంటుంది. గారాబాలన్నీ సహిస్తుంది. ఎవరికే అవసరంఉన్నా అన్నీ ఆమెవల్ల నెరవేరుతాయని అతడి

ఉద్దేశ్యం. కలకత్తా రాజవీథులలో తిరుగుతూ తిరుగుతూ, తనసంగతి తనే చూసుకోవాలన్న సంగతి కొంతవరకు తెలుసుకున్నాడు. కాని ఇక్కడకు వచ్చినప్పటినుంచి తన విగతజీవితమంతా ఒకప్పుడెప్పుడైనా తలచుకున్నానని కాని, అథవా ముందు తలచవస్తుందన్నదికూడా మరచి పోయాడు.

చొక్కాలు, పంచలు, చెప్పులు, గొడుగు, చేతి కర్ర మొదలైనవి కావలసినవన్నీ అతడిచేతిక్రింద చాలా వున్నాయి. జేబురుమాలుకూడా అతడికోసమని ఎవరో ఆదరంతో అమర్చిఉంచేవారు. మొదట్లో కుతూహలం కలిగి, ఇవన్నీ ఎక్కడినుంచి వచ్చాయని ప్రశ్నిస్తే బడదీదీ పంపిందని సమాధానం వచ్చింది. ఫలహారాల పళ్ళెం చూడగానే దానికి బడదీదీ ఆదరపూర్వమైన స్పర్శ తగి లిందనికూడా ఇప్పుడు గ్రహించ గలుగుతున్నాడు.

ఒకనాడు లెఖ్ఖలు వేయటానికి కూర్చుని, ఒక గీత గీసుకోటానికి కంపాస్ కావలసివచ్చి, ప్రమీలతో బడదీదీ దగ్గరకు వెళ్ళి కంపాసు తీసుకువచ్చి కూర్చోమని చెప్పాడు.

కంపాసు కావలసిన పనిఉండదు బడదీదీకి. అది ఆమె దగ్గరలేదు. కాని వెంటనే ఆమె బజారుకు మనిషిని పంపింది. సాయంకాలం షికారుకు వెళ్ళి సురేంద్రుడు తిరిగి వచ్చి చూచుకునేసరికి, తన టేబిల్ మీద తాను కోరిన వస్తువు పడిఉంది. మర్నాడు ఉదయం ప్రమీల "దీన్ని నిన్న అక్క పంపింది మాష్టారూ!" అని చెప్పింది.

ఆ తర్వాత అప్పుడప్పుడు అతడు ఒకటి - అర ఏవైనా వస్తువులు కోరుతూ ఉండేవాడు. మాధవి వాటి కోసం చాలా ఇబ్బంది పడేది. ఎంతో ప్రయత్నం చేసి అయినా అతడి కోరికనుతీర్చేది. కాని ఎన్నడూ 'ఇవ్వను' అని మాత్రం చెప్పలా.

ఇంకా అదీగాక హఠాత్తుగా అప్పుడప్పుడు – బడ దీదీ దగ్గరకువెళ్ళి అయిదారు పాతబట్టలు తీసుకురా బీద వాళ్ళకివ్వాలని – ప్రమాణాలతో చెబుతూ ఉండేవాడు. పాత కొత్తఅనే విచక్షణ మాధవికి ఎప్పుడూ ఉండేదికాదు. ఆమె తనవే నాలుగయిదు గుడ్డలిచ్చిపంపి, మేడమీది కిటికీలోంచి చూస్తూ ఉండేది – నలుగురయిదుగురు దీనులు వాళ్ళకి వస్త్రాలు లభించాయని ఉత్సాహంతో హడావుడిగా వెళు తూ ఉండేవాళ్ళు.

సురేంద్రుడుచేసే ఈ చిన్న చిన్న అత్యాచారాలను నిత్యమూ మాధవి సహిస్తూఉండేది. క్రమంగా వీటికన్ని టికీ మాధవి అలవాటు పడింది. ఒక నూతనవ్యక్తి తమ కుటుంబంలోకి వచ్చి నిత్యమూ కార్యకలాపాల్లో కొత్త రకం ఇబ్బందులను కలిగిస్తున్నాడన్న ఆలోచనకూడా ఆమెకు కలిగేదికాదు

అంతేకాదు. ఈ నూతనవ్యక్తికోసం, ఎన్నో వెతకి తెప్పించటానికని మాధవి ఎంతో కనిపెడుతూవుండాల్సి వచ్చేది. అతడు కావలిసినవన్నీ అడిగి తెప్పించుకొంటే మాధవికి సగం శ్రమతగ్గేది. అతడు తనకు కావలసినవేవీ అడగడు. ఇవన్నీ ఆమె ఆలోచించవలసిందే. సురేంద్రుడు

అతి పరధ్యానం మనిషన్న సంగతి మొదట్లో ఆమెకు తెలియదు. పొద్దునపూట టీ చల్లారిపోతున్నా అతడు తాగే వాడు కాదు. తినుబండారాలు స్పృశించాలనైనా అతడికి తోచేదికాదు కుక్కముట్టుకుని ఎత్తుకునిపోతూ వుండేది కూడా అప్పుడప్పుడు. భోజనానికి కూర్చుంటే అన్నానికి, ఆధరువులకీ వ్యత్యాసంగమనించేవాడుకాదు. పక్కను త్రోసేసి అన్నీ క్రిందకునెట్టేసేవాడు. ఏవస్తువూ అతడి మనస్సుకు నచ్చేదికాదు. నౌకర్లువచ్చి, మాష్టారుగారు ఒక్కపిచ్చివాడు, ఆయనకేం తెలియదు. వేటినీచూడడు. పుస్తకంతీసుకుని కూర్చుంటాడు. అని అనేవాళ్లు.

వ్రజబాబు అప్పుడప్పుడు వుద్యోగం దొరికేసదుపాయాలు ఏవైనా కన్పించాయా లేదా అని అడుగుతూ వుండేవాడు. సురేంద్రుడేదో సమాధానం చెప్పేవాడు. వుద్యోగంకోసం మాష్టరుగారు చేస్తున్న ప్రయత్నం రవ్వంతైనా లేదనీ, అతడికి అసలావాంఛే లేదని, ప్రస్తుతం దొరికిందేదో అదే పరమసంతోషంగా వుందనీ, మాధవి తండ్రివల్లనూవిన్నది. తానూ తెలుసుకుంది.

పది గంటలయ్యేసరికి బడదీదీ దగ్గిరనుంచి, స్నానానికి భోజనానికి పిలుపువచ్చేది. చక్కగా భోజనంచెయ్యకపోతే బడదీదీతరఫున ప్రమీల బ్రతిమాలుతూ వుండేది. రాత్రి పొద్దుపోయేవరకు పుస్తకంతీసుకుని కూర్చుంటే నౌకర్లు వచ్చి లైట్లు ఆర్పేసేవారు. అడ్డువస్తే బడదీదీ హుకుం——' అని చెప్పేవాళ్లు.

ఒకరోజున బడదీదీ తంక్రితో — "ప్రమీలఎంతో

ప్రమీల మాష్టరూ అంతే నాన్నా!" అన్నది నవ్వుతూ.

"ఎందుకనమ్మా?"

"ఇద్దరూ చిన్నపిల్లలే. ఎప్పుడు తనకేది అవసరమో, ఎప్పుడుతినాలో, ఎప్పుడుపడుకోవాలో. ఎప్పుడు ఏంచెయ్యటం మంచిదో ప్రమీల కెలా అయితే తెలియదో, కాని మాష్టరుకూడా అదేరకం. తన కేంకావాలో ఏమీ తెలియదు - పైగా ఆసమయంలో ఆలోచనలేకుండా అవీ ఇవీ కావాలంటాడు జ్ఞానంవచ్చిన వాళ్లెవరూ అలా అడగరు"

వ్రజబాబు తెలుసుకోలేకపోయాడు. ముఖంకేసి చూస్తు ఊరుకున్నాడు.

మాధవినవ్వి, "ఎప్పుడుతనకేది అవసరమో మీ అమ్మాయికి తెలుసా?" అని అడిగింది.

"అది తెలియదు."

"ఆసమయంలో చూరాంచేస్తుందా?"

"అది చేస్తుంది."

"మాష్టారుగారు అలాగే చేస్తారు."

వ్రజబాబు నవ్వుతూ, "ఈగ్రవాడు కొంచం పిచ్చివాడనుకుంటాను." అన్నాడు.

"పిచ్చివాడుకాదు. గొప్ప ఇంటివాడనుకుంటాను.

వ్రజబాబు ఆశ్చర్యపడి, "ఎలా తెలుసుకున్నావు?" అని అడిగాడు.

మాధవికి తెలియదు. కాని అలా అని అనుకుంది సురేంద్రుడు తన పనిఏదీ తను చేసుకునేవాడుకాదు. ఇతర్లే

మీద ఆధారపడివుండేవాడు ఇతర్లు చేస్తే చేస్తారు. లేకపోతే లేదు. ఆ దౌర్బల్యమే అతణ్ణి మాధవికి పట్టిచ్చింది. ఇది అతడికి పూర్వపు అలవాటు అనుకున్నదామె.

ఏ ఆహారపదార్థమూ అతడి మనస్సును ఆకర్షించక పోయేది. అతడు దేన్ని సంతృప్తిగా భుజించే వాడు కాదు. వేటినీ స్పృశించేవాడు కాదు. వృద్ధులాగా ఈ వైరాగ్యం, కుర్రవాడిలాగా సరళత్వం, పిచ్చివానిలాగా ఉపేక్షాభావం_ తినమనిఇస్తే తింటాడు. లేకపోతే లేదు. ప్రత్యేకించి ఆహార విషయాల్లో ఈ నూతనపద్ధతే మాధవిని మరింత చకితు రాల్నిగా చేసింది. ఇదంతా ఆమెకేమీ అర్థమయ్యేది కాదు. పరోక్షంగా ఒక కరుణాదృష్టి ఈఅజ్ఞాతుడైన మాష్టరుగారిమీద వేసివుంచేది. ఆమె సిగ్గుపడికాదు ప్రత్యక్షంగా చూడకపోవటం, అదేంలేదు - ఆమెకవాంటి అవసరంరాలేదు. కనుక చూడటంలా. అవసరంవచ్చినప్పుడి హాసమయూసమయూలేవీ అడ్డురావు—ఒకేసారి బడదీదీ దగ్గరకు అర్జీవచ్చి వచ్చిపడుతుంది. మాధవి మందస్మితం చేసి, ఈవ్యక్తి కుర్రవాడిలాగా ఒక్తి అమాయకుడు, అనుకుంటుంది.

౪

మనోరమ మాధవికి చిన్నప్పటి స్నేహితురాలు. ఆమెకు ఈ మధ్య చాలారోజులు ఉత్తరం రాయలా. సమాధానం రాకపోవటంవల్ల ఆమెకు చాలా కోపంకూడా

వచ్చింది. ఇవాళ మధ్యాహ్నం కాస్త తీరుబడిచేసుకుని, మాధవి ఆమెకు ఉత్తరం రాయటానికి కూర్చుంది. సరిగ్గా ఈ సమయానికే ప్రమీల వచ్చి 'పెద్దక్కయ్యా!' అని పిలిచింది. మాధవి తలఎత్తి 'ఏమిటి?' అని అడిగింది.

'మాష్టారుగారి కళ్ళజోడు ఎక్కడో పోయింది. ఒక జోడు ఇయ్యి.

మాధవి నవ్వుతూ, 'నేను ఏం కళ్ళజోళ్ళదుకాణం పెట్టుకున్నానా? వెళ్ళి మీ మేష్టారుతో చెప్పు' అన్నది. ప్రమీల పరుగెత్తుకు పోతోంది. మాధవి ప్రమీలను వెనక్కి పిలిచి 'ఎక్కడికి వెడుతున్నావే?' అని అడిగింది.

'చెప్పటానికి'

'అంతకన్న మేనేజరుగారిని పిలుచుకురా' ప్రమీల మేనేజరుని పిలుచుకునివచ్చింది. 'మాష్టారుగారి కళ్ళజోడు పోయిందట! వెళ్ళి మంచి జోడుఒకటి చూసి కొనుక్కుని రా!' అని చెప్పింది మాధవి.

మేనేజరు వెళ్ళిపోయాడు. ఆమె మనోరమకు ఉత్తరం రాసి, చివర ఇదికూడా రాసింది—

'ప్రమీలకోసం నాన్నగారు ఒక మాష్టర్ని పెట్టారు. అతడ్ని పెద్దవాడనీ అనవచ్చు, కుర్రవాడనీ అనవచ్చు. ఇంతకుపూర్వం అతడెప్పుడూ యిల్లు విడిచిపెట్టినవాడు కాదని తోస్తుంది. ప్రపంచమంటే ఏమీ ఎరగడు. అతణ్ణి చూడకపోయినా, అతణ్ణి కనిపెట్టుకుని ఉండకపోయినా ఒక్క గడియైనా గడవదతడికి. నాకు సగంకాలం దానితో

సరిపోతోంది—ఇంక నీకు ఉత్తరం ఎప్పుడు రాయను? ఇక్కడకు నువ్వొకసారి త్వరగావస్తే, ఆ అసమర్థుణ్ణి చూపిస్తా నీకు ఇంత అసమర్థుణ్ణీ, అన్యమనస్కుణ్ణీ నువ్వు జన్మలో చూసి ఉండవు. తినటానికి ఇస్తేతింటాడు. ఇవ్వకపోతే మెదలకుండా ఉపవాసం చేస్తాడు. రోజల్లా ఊరుకున్నా అతడికి భోజనం చేసిందీ లేనిదీ అతడికే తెలియదు. ఒక్కరోజైనా అతడు తనంతటతాను గడుపుకోలేడు. ఇలాండివాడు ఇల్లువిడిచి బైటికి ఎందుకువచ్చాడా అని ఆలోచిస్తున్నా. అతడికి తల్లీ తండ్రీ ఉన్నారనివిన్నాను—కాని వాళ్ళ మనస్సులు పాషాణాల లాంటివి అనుకుంటాను. ఇలాంటివాడిని నే నయితే కనుమదుగుకు పోనిచ్చేదాన్ని కాదు.

మనోరమ తమాషాగా జవాబిచ్చింది. 'నీ ఉత్తరంలోని సంగతులనుబట్టి, నువ్వు మీ ఇంట్లో ఒక కోతిని పెంచుతున్నావని—ఆ కోతికి నువ్వు సీతాదేవివయావని తెలుసుకున్నాను. కాని అయినా కొంచెం జాగ్రత్తగా ఉండమని చెబుతున్నాను'—మనోరమ.

ఉత్తరం చదివే సరికి మాధవి ముఖం కొంచెం ఎర్రపడింది — 'నీది జ్వాలాముఖం. అంచేతే ఎవర్ని హాస్యమాడాలో కూడా ఎరగవు' అని సమాధానమిచ్చింది.

'మీ మాష్టారుగారి జోడు ఎలాఉన్నదే ప్రమీలా?' అని ప్రశ్నించింది మాధవి.

'చాలా బాగుంది.'

'ఎలా తెలుసుకున్నావు ?'

'మాష్టారుగారు ఆజోడు పెట్టుకునే పుస్తకాలు చక్కగా చదువుతున్నారు - అంచేత తెలుసుకున్నాను.'

'ఆయన స్వయంగా ఏమీ అనలేదా ?'

'ఏమీ అనలా.'

'ఒక్క మాటకూడా అనలేదూ ? బాగుందని కాని, బాగుండలేదని కాని, ఏమీ అనలేదా?'

'ఏమీ అనలేదు'

ఎప్పుడూ వికసించిఉండే మాధవి ముఖం ఒక్క క్షణం మలినమైంది. కాని వెంటనే నవ్వుతూ, 'ఆ జోడు మళ్ళీ పారేసుకోవద్దని మీ మాష్టారుగారితో చెప్పు' అన్నది.

'సరే. చెబుతా.'

'ఫో. పిచ్చిదానా, అలా చెప్పవచ్చు ? ఆయన మనస్సులో ఏమన్నా అనుకుంటాడేమో ?'

'అయితే చెప్పవద్దా ?'

'వద్దు.'

శివచంద్రుడు మాధవి అన్న. మాధవి ఒకరోజున అతణ్ణి పిలిచి, 'ప్రమీల మాష్టారుగారు రాత్రింబగళ్లు ఏం చదువుతూ ఉంటాడో తెలుసా అన్నయ్యా ? అని అడిగింది.

శివచంద్రుడు బి. ఏ. చదువుతున్నాడు. ప్రమీలకు చదువుచెప్పే చిన్నచిన్న మాష్టర్లు అతడి దృష్టికి ఆనరు. అతినిర్లక్ష్యంగా, 'నాటకాలూ, నవలలూ చదువుతాడు. అంతకన్న ఏం చదువుతాడు ?' అన్నాడు. మాధవికి నమ్మ

కం చిక్కలా. ప్రమీలద్వారా ఒకపుస్తకం చాటుగా తెప్పించి, అన్నగారిచేతికిచ్చి 'నాటకం నవలా కాదేమో అనిపిస్తుంది' అన్నది,

శివచంద్రుడు ఆ పుస్తకం మొదటినుంచి చివరవరకు చూసినా ఏమీ తెలియలా. అందులో ఒక్కఅక్షరమైనా తెలియకపోయినా అది లెఖ్ఖలపుస్తకం అనిమాత్రం తెలుసుకున్నాడు.

చెల్లెలిదగ్గర తన పరువు పోగొట్టుకోలేక 'ఇది లెఖ్ఖల పుస్తకం..స్కూల్లో చిన్నక్లాసులవాళ్ళకు చెప్పేపుస్తకం' అన్నాడు.

మాధవి విషణ్ణముఖంతో 'పెద్దపుస్తకమేమీ కాదా? కాలేజీ పుస్తకమయినా కాదూ?' అని అడిగింది.

శివచంద్రుడు శుష్కకంఠంతో 'కాదు ఏమాత్రం కాదు' అన్నాడు. కాని ఆనాటినుంచీ శివచంద్రుడెన్నడూ బుద్ధిపూర్వకంగా సురేంద్రుని ఎదట పడలేదు - వెనకటి సంగతులు ఏవైనా అడిగితే, అన్నిసంగతులూ బయట పడతాయి. అలా అయితే తండ్రి ఆదేశంప్రకారం ప్రొద్దున్నే ప్రమీలతోపాటు తానుకూడా పెన్సిల్ పుచ్చుకుని ఈ మాష్టారుదగ్గర కూర్చోవలసి వస్తుందేమో నని అతనికి భయం ఉండేది.

కొన్నాళ్ళయాక మాధవి తండ్రితో, 'కొన్నాళ్లపాటు ఉండటానికి నేను కాశీ వెడతాను నాన్నా!' అన్నది.

వ్రజబాబు విచారగ్రస్తుడై 'అదేమిటమ్మా? నువ్వు

కాశీ వెడితే ఈసంసారం ఏమవుతుంది?' అన్నాడు. మాధవి నవ్వుతూ 'నేను మళ్ళీవస్తాను. ఏకంగా ఒకేసారి వెళ్ళిపోవటంలేదుగా!' అన్నది.

మాధవి నవ్వింది కాని, తండ్రి నేత్రాల్లో నీళ్లు తొణికినలాయి. ఇలాంటిమాట అనటం అన్యాయమని ఆమె గ్రహించింది. ఆయన విచారంపోగొట్టటానికని 'కొన్నాళ్లపాటు మాత్రం ఉండివస్తాను' అన్నది.

'అయితే వెళ్ళు – కాని ఈ సంసారం నడవదు'

'నేను లేకపోతే సంసారమే నడవదా?'

'నడవకపోవటమేం అమ్మా, నడుస్తుంది. చుక్కాని విరిగిన పడవ నదిలో ఎలా నడుస్తుందో – ఇదీ అలాగే నడుస్తుంది.'

కాని ఆమె కాశీవెళ్ళవలసిన అవసరం చాలా ఉంది. అక్కడ ఆమె విధవాడుబిడ్డ కొడుకుని ఒక్కణ్ణే పెట్టుకుని ఉంటోంది. ఆమెను ఒకసారి చూసి రావాలి.

కాశీ వెళ్లేరోజున ఒక్కొక్కరినే పిలిచి ఆమె సంసారభారం అప్పగించింది. ముసిలిదాసీని పిలిచి, తండ్రినీ, అన్నగారినీ, ప్రమీలనూ శ్రద్ధగా కనిపెట్టిఉండమని బ్రతిమాలి చెప్పింది. కాని మాష్టారుసంగతిమాత్రం ఎవరికీ చెప్పలా. మరచిపోయికాదు – బుద్ధిపూర్వకంగానే చెప్పలా. ప్రస్తుతం అతడిమీద కొంచెం కోపంగా ఉంది. మాధవి అతడికోసం ఎన్నో చేసింది. కాని దీనికి ప్రత్యామ్నాయా అతను కృతజ్ఞతాసూచకంగా ఒక్క మాటైనా నోటిమీదుగా తెలియచెయ్యలా. అంచేత మాధవి పరాయి

దేశం వెళ్ళి ఈ అసమర్థుడికి, ఈ ప్రపంచజ్ఞానవిహీనుడికి, ఈ ఉదాసీనుడికి, తానొకతె నున్నానని తెలియచెయ్యాలని అనిపించింది. కాస్త కుతూహలంకలిగితే తప్పేముంది? ఆమె లేకపోతే ఇక్కడ రోజులు ఎలా గడుస్తాయో చూస్తే నష్టమేమిటి? అంచేతనే సురేంద్రుడి విషయమై ఆమె ఎవ్వరికీ ఏమీ చెప్పలేదు.

సురేంద్రనాథుడు ప్రాబ్లంసాల్వ్ చేస్తున్నాడు. ప్రమీలవచ్చి, "నిన్నరాత్రి అక్కయ్య కాశీవెళ్లింది." అనిచెప్పింది. ఆమాట అతని చెవికెక్కలేదు. కాని రెండు మూడు రోజులయ్యాక తెలుసుకోగలిగాడు - పదిగంటలయినా భోజనానికి నిర్బంధించేవాళ్లులేరు - ఒక్కొక్క రోజున ఒంటిగంటా రెండూకూడా అవుతుండేది. స్నానమయ్యాక బట్టలు విడవాలని చూస్తే,అప్పటిలాగా ఉతికిన బట్టలుండేవికావు. ఆహారం తెచ్చేపళ్లెంకూడా అలాఅన్నీ అమర్చిఉండేదికాదు. రాత్రిళ్లు లైటు ఆర్పటానికి ఎవరూ వచ్చేవాళ్లుకారు. చదువుతూఉన్నారుంటే రెండూ-మూడు అయ్యేది. ప్రొద్దున్నేనిద్ర మెళుకువ వచ్చేదికాదు. లేచేసరికి పొద్దుఎక్కేది. పగలంతా ఎంతచూచినానిద్రమత్తు పోయేదికాదు. శరీరం అంతా అలసినట్లయిపోయినప్పుడు ఈ సంసారంలో కాస్త మార్పు వచ్చినట్లుందే అని తోచింది ఉక్కగా ఉన్నదని తోచినప్పుడే విసనకర్రకోసం వెతుకుతారు. సురేంద్రుడు పుస్తకం మీదనుంచి ముఖమెత్తి 'ప్రమీలా బడదీదీ ఇక్కడలేదుకదూ ?' అని అడిగాడు.

'అక్క కాశీ వెళ్లింది' అన్నది ప్రమీల.

'అందుకనే'

రెండురోజులయాక హఠాత్తుగా ప్రమీలకేసి చూసి, 'బడదీదీ ఎప్పుడు వస్తుందని?' అని అడిగాడు.

'నెల్లాళ్ళకి.'

సురేంద్రుడు మళ్ళీ పుస్తకంకేసి ధ్యాసపోనిచ్చాడు. మరో అయిదురోజులు గడిచాయి. సురేంద్రుడు పుస్తకం మీద పెన్సిలుపెట్టి, 'నెలఅవటానికి ఇంకా ఎన్నాళ్ళున్నాయి?' అని అడిగాడు.

'చాలా రోజులు.'

పెన్సిలు చేత్తోపట్టుకుని, కళ్ళజోడుతీసి, అద్దాలుతుడిచి, మళ్ళీపెట్టుకుని, పుస్తకంకేసి చూస్తూ కూర్చున్నాడు.

మర్నాడు–బడదీదీకి నువ్వు ఉత్తరం రాశావా ప్రమీలా అని అన్నాడు.

'వ్రాయకేం?'

'త్వరగా రమ్మని రాశావా?'

'లేదు.' సురేంద్రుడు మెల్లిగా నిట్టూర్పు విడిచి, 'అందుకనే–' అన్నాడు మెల్లిగా.

'మాష్టారూ! బడదీదీ వస్తే బాగుంటుంది కదూ?' అన్నది ప్రమీల.

'బాగుంటుంది.'

'రమ్మని వ్రాయనా?'

సురేంద్రుడు సంతోషంతో 'వ్రాయి' అన్నాడు.

'మీ మాటకూడా వ్రాయనా ?'

'వ్రాయి.'

వ్రాయమని చెప్పటానికి అతడికేవిధమైన సంకోచమూ కలగలేదు. ప్రాపంచిక పద్ధతులు - మర్యాదలు అతడికేవీ తెలియవు. బడదీదీని రమ్మని కోరటం అతడికి అసంగత మనిపించలేదు.

ఎవరులేకపోతే అతడికి కష్టంగా ఉంటుందో, ఎవరులేక పోతే అతడికి గడవదో - వారిని రమ్మని చెప్పటం అసం గతమనుకోలేదతడు.

ఈ ప్రపంచంలో ఎవరికి కుతూహలం తక్కువో, వాళ్లు సాధారణ మానవ సమాజానికి కొంచెం వెలుపలగా ఉం టారు. సామాన్య మానవులు తిరిగే సంఘంతో వాళ్లకు కలయిక కుదరదు. సాధారణ మనుష్యుల అభిప్రాయాలతో వాళ్ళ అభిప్రాయాలు కలియవు. సురేంద్రుడిది కుతూ హలపడే స్వభావంకాదు. అతడి కెంతవరకు అవసరమో, అంతవరకే తెలుసుకోవాలను కుంటాడు. కాని అంతకు మించి బుద్ధిపూర్వకంగా ఒక్క అడుగైనా ముందుకు వెయ్యాలని పించదతడికి. - తీరికకూడా ఉండదు. అంచేత బడదీదీ విషయంలో అతడు కేవలం అనభిజ్ఞుడు. ఇన్నాళ్లూ ఈ సంసారంలో గడిచిపోయాయి. ఈ మూడు నెలలనుంచీ అతడు బడదీదీమీద భారంవేసి, పరమ విశ్రాంతిగా గడిపి వేశాడు - కాని ఎన్నడూ ఆమె ఎలాంటిదో ప్రశ్నించి ఎర గడు. ఆమె ఎంతపెద్దదో, ఎంతవయస్సుందో. చూడటాని

కెలా ఉంటుందో, గుణాలు ఎలాంటివో ఏమీ తెలియ వలేడికి. తెలుసుకోవాలని ఇచ్ఛ అయినా కలగలేదు. మనస్సుకీ తోచలేదు. ఈమెను గురించి ఒక్క మాట అడిగి తెలుసుకుంటే అది లోకధర్మమే అవును!

అంతా బడదీదీ అంటారు. ఆతడూ బడదీదీ అంటాడు. అంతా ఆమె ఆదరాభిమానాలను పొందుతూ ఉంటారు; ఆతడూ పొందుతున్నాడు. విశ్వభాండార మామెదగ్గిర దాచిపెట్టబడింది. కోరినవాళ్ళకు లభిస్తుంది. సురేంద్రుడు కూడా తీసుకున్నాడు. ఇందులో ఆశ్చర్యకరమైన సంగతే ముంది? వర్షించటం మేఘాల సహజధర్మమయినట్లే - ఆద రాభిమానాల్ని చూపటం బడదీదీకి సహజకృత్యం. వర్షం కురిసినప్పుడు చెయ్యిజాపినవారికి జలం లభిస్తుంది. బడదీదీ దగ్గర చెయ్యిజాపినవారికి అభీష్టవస్తువు లభిస్తుంది. మేఘం లాగానే ఆమె అంధ అనుకోవచ్చు. వాంఛకూడా ఆ కాంతకూ హీనం! ఆతడు ఆమెనుగురించి స్థూలంగా ఇలాంటి నిశ్చ యానికి వచ్చాడు. వచ్చినప్పటినుంచీ ఆమె విషయమై అతడెలాంటి అభిప్రాయాన్ని కలిగిఉన్నాడో - ఈనాడూ ఆ అభిప్రాయం అలాగేఉంది. ఆమె కాశీవెళ్లటం తటస్థించిం దగ్గరనుంచీ మాత్రం - ఈ బడదీదీ లేకుండా తాను ఒక్క క్షణమైనా గడపలేనన్న సంగతి - స్పష్టంగా తెలుసు కున్నాడు.

అతడు ఇంటిదగ్గర ఉన్నరోజుల్లో తన తండ్రినీ, సవతి తల్లినీ ఎరుగు. వాళ్ళ కర్తవ్యమేమిటోకూడా ఎరుగడతడు. కాని 'బడదీదీ' అనే వారితో, ఎవరితోనూ పరిచయం

కలగలా. పరిచయ మయినప్పుడు ఆమె ఇలాగే ఉంటుందని తెలుసుకున్నా డింతే! కాని వ్యక్తితో పనిలేదు. పేరు సర్వస్వమూ!

ఇష్టదేవత నెవరూ చూడలేరు. పేరుమాత్రం వ్రాసి ఉంచుకుని, కష్టాల్లోనూ దుఃఖం కలిగినప్పుడూ ఆ పేరు ముందర హృదయాన్ని మూర్తీభవింపచేసి, మోకరిల్లి, కరుణాభిక్ష నర్థిస్తారు. కళ్ళలోనిండిన అశ్రువులను తుడుచుకుని, శూన్యదృష్టితో ఎవర్నో చూడాలని వాంఛిస్తారు. కాని దేన్నీ జూడలేరు. తడబడుతున్న జిహ్వతో ఒకటి రెండు మాటలను అస్ఫుటంగా ఉచ్చరించి ఊరుకుంటారు. దుఃఖపడిన సురేంద్రుకూడా అలాగే 'బడదీదీ' అని అస్ఫుటంగా ఉచ్చరించాడు.

౫

అప్పటికింకా సూర్యోదయం కాలేదు. తూర్పుదెస మాత్రం ఎర్రపడింది. ప్రమీలవచ్చి నిద్రపోతున్న సురేంద్రుని మెడకు రెండుచేతులూ చుట్టేసి 'మాష్టరుగారూ!' అన్నది. సురేంద్రుడు నిద్రమత్తుతో కళ్ళురెండూ కొంచెం తెరిచి, 'ఎందుకు ప్రమీలా?' అన్నాడు.

'బడదీదీ వచ్చింది'

సురేంద్రుడు లేచి కూర్చుని, ప్రమీలచెయ్యిపట్టుకుని 'పద! చూసివద్దాం' అన్నాడు.

ఈ చూడిరావలనే ఇచ్ఛ అతడి మనస్సులో ఎలా

కలిగిందో చెప్పలేము. ఇన్నాళ్లకి అతడు ప్రమీల చెయ్యి పట్టుకుని కళ్లు నులుముకుంటూ లోపలికెందుకు వెళ్ళాడో అదికూడా తెలియదు. కాని అతడు లోపలికివెళ్ళి మెట్లెక్కి పైకివెళ్ళి మాధవి గది ఎదటికి వెళ్ళి నుంచుని 'బడదీదీ' అని పిలిచాడు.

బడదీదీ పరధ్యాన్నంగా ఉండి ఏదో పనిచేసుకుంటూ 'ఏమిటి చెల్లీ!' అన్నది.

'మాష్టరుగారు_'

ఇద్దరూ వెంటనే లోపలికి వెళ్లారు. మాధవి సిగ్గుతో లేచి తలమీది ముసుగును చేత్తో ముందుకు లాక్కుని, ఒకమూలకు జరిగినుంచుంది. 'బడదీదీ, నీ మూలాన నేను చాలా కష్టం-' అంటున్నాడు సురేంద్రుడు. మాధవి ముసుగులోపలనే సిగ్గుతో నాలుక కొరుక్కుని ఛీ,, ఛీ, అనుకుంది మనస్సులో.

'నువ్వు వెళ్లిపోయూక-'

'ఎంతసిగ్గు!' అనుకుంది మాధవి మనస్సులో.

'మాష్టారుగార్ని బైటికి వెళ్లమని చెప్పు ప్రమీలా!' అన్నది మాధవి మృదుకంఠంతో.

ప్రమీల చిన్నపిల్లయినా, అక్క ప్రవర్తనను బట్టి ఈపని మంచిది కాదని తెలుసుకుంది_ 'పదండి మాష్టారుగారూ' అన్నది.

సురేంద్రుడు తెల్లబోయి కాస్సేపు అలాగే నిలబడి, తర్వాత 'పద' అన్నాడు. అతిగా మాట్లాడం అతడికి చేత కాదు _ అతిగా మాట్లాడాలనీ అనుకోలేదు. అయినా

రోజంతా సూర్యుడు మేఘాల చాటున ఉంటే ఆ దిక్కు కేసి అంతా ఎలా చూడాలనుకుంటారో, సూర్యుని చూడ కూడదు, చూస్తే కళ్లకు బాధకలుగుతుందని ఒక్క క్షణం అనిపించదో, అలాగే ఒక్క నెలరోజులు మేఘాచ్ఛన్నమైన ఆకాశంలో ఉన్న ప్రథమ సూర్యోదయాన్ని సురేంద్రుడెంతో ఆహ్లాదంతో చూడాలని వెళ్లాడు. కాని ఫలితం ఇలా ఉంటుందని అతడు అనుకోలేదు.

అప్పటినుంచీ అతడికి ఆదరంకూడా కొంచెం తగ్గింది. మాధవి కొంచెం సిగ్గుపడేది. దాసీ బిందు ఏదో ఈ మాట ఒకసారి తీసుకునివచ్చి కొంచెం ఎగతాళి చేసింది. సురేంద్రుడు కూడా కొంచం చిన్నపుచ్చుకున్నాడు. అంతులేని ఆ బడదీదీ భాండారానికి ఈనాడు ఒకహద్దు ఏర్పడిందని కూడా గ్రహించాడు. సోదరి ప్రేమ, మాతృ వాత్సల్యం, అతడివైపుకు రావటంలేదు. కొంచెం దూరదూరంగా వైదొలగి పోతున్నాయి.

ఒకరోజున ప్రమీలతో 'బడదీదీకి నామీద కోపం వచ్చింది కాదూ?' అన్నాడు.

'ఆఁ.'

'ఎందుకని?'

'మీరు లోపలికలా ఎందుకు వచ్చారు?'

'రాకూడదు కదూ?'

'అలా రావచ్చామరి? అక్కకు బాగాకోపంవచ్చింది.'

సురేంద్రుడు పుస్తకంమూస్తూ 'అదే' అనుకున్నాడు.

తర్వాత ఒకనాడు మధ్యాహ్నం జోరున వర్షం కురు

స్తోంది. వ్రజరాజబాబు రెండురోజుల్నుంచీ ఇంట్లో లేడు. జమీందారీ చూసుకోటానికి వెళ్ళాడు. మాధవికి చేతిలో పనేంలేదు. ప్రమీల అల్లరి చేస్తోంది. మాధవి ప్రమీలను పట్టుకుని 'నీ పుస్తకాలు తీసుకురా! ఎంతవరకు చదివావో చూస్తాను' అన్నది.

ప్రమీల ఒక్కసారిగా కొయ్యబారిపోయింది. 'తీసుకురా!' అన్నది మాధవి.

'రాత్రికి తీసుకువస్తాను అక్కా!'

'కాదు. ఇప్పుడే తీసుకురా?' ఎంతో ఏడుపుముఖంతో పుస్తకాలు తీసుకురావటానికి వెళ్లింది. వచ్చి 'మాష్టరు గారు ఏమీ చెప్పటంలా. ఆయనమాత్రం చదువుకుంటూ ఉంటారు' అన్నది. మాధవి అక్కడక్కడా కొన్ని ప్రశ్నలు వేసి, మాష్టరుగారు నిజంగానే ఏమీ చెప్పటంలేదని తెలుసుకుంది. పైగా ఇంతవరకు చదువుకున్నదంతా, మేష్టార్ని పెట్టినదగ్గరనుంచీ ఈ మూడునాలుగు నెలల్లోపల మెల్లి మెల్లిగా అంతా మరిచిపోయింది. మాధవి విరక్తురాలై బిందూని పిలిచి. 'బిందూ 'మాష్టారు దగ్గిరకెళ్లి ఇన్నాళ్ళ నుంచీ ప్రమీలకు చదువేమీ ఎందుకు చెప్పటంలేదో అడిగిరా! అన్నది.

బిందు అడుగుదామని వెళ్లేసరికి మాష్టారుగారు ప్రాబ్లం ను గురించి ఆలోచిస్తున్నాడు. 'మాష్టరుగారూ చిన్నఅమ్మాయికి మీరు చదువేమాత్రం ఎందుకు చెప్పటంలేదో బడదీదీ అడిగిరమ్మన్నది' అన్నది బిందు.

'ఏమిటి?'

'బడదీదీ అడగమన్నది–'

'ఏమని అడగమన్నది ?'

చిన్నమ్మాయికి చదువెందుకు చెప్పటంలేదూ అని...'

'బాగా ఉండటంలేదు' అని జవాబిచ్చాడు పరధ్యానంగా.

బాగా ఉండకపోవటం కాదనిభావించి, ఈసంగతి బిందు మాధవితో చెప్పింది. మాధవికి కోపంవచ్చింది. ఆమె కిందికి వచ్చి, తలుపుచాటున నుంచుని, 'చెల్లెలికి చదువేమీ చెప్పటం లేదెంచేత ?' అని బిందుచేత అడిగించింది. ఈ మాట రెండుమూడుసార్లు అడిగినమీదట 'నేను చెప్పలేను' అన్నాడు సురేంద్రుడు.

ఇదెక్కడి సంగతి అనుకున్నది మాధవి.

'అయితే మీరిక్కడెందున్నారు ?' అన్నది బిందు.

'ఉండకపోతే ఎక్కడకు వెళ్లను ?'

'అయితే చదువెందుకు చెప్పరు ?'

సురేంద్రుడికీసారి చైతన్యం కలిగింది. ముందుకు తిరిగి కూర్చుని, 'ఏమిటి అడుగుతున్నావు ?' అన్నాడు. బిందు ఇప్పటివరకు చెప్పిందే మళ్లీ ఆవృత్తిచేసి చెప్పింది. 'రోజూ చదువుతున్నదిగా !' అన్నాడు సురేంద్రనాథుడు.

'చదువుకుంటున్నదేమో మీరు చూస్తున్నారా ?'

'లేదు. నాకు తీరికలేదు.'

'అయితే ఈ ఇంట్లో ఎందుకుంటున్నారు ?' సురేంద్రుడు మెదలకుండా ఆ సంగతే ఆలోచిస్తున్నాడు.

'మీరింక చదువు చెప్పలేరా ?'

'ఊహుఁ. చదువు చెప్పటం నాకు బాగుండదు.'

మాధవి లోపల్నుంచి- 'అయితే ఇన్నాళ్లనుంచి మిథ్యాసేపంతో ఎందుకుంటున్నారో అడుగు బిందూ ?' అన్నది. బిందు ఆమాటే అడిగింది. ఆ మాట వినేటప్పటికి సురేంద్రుడి ప్రాబ్లముల అల్లిక తెగిపోయింది. కొంచెం కష్టం కలిగింది. కాస్సేపు ఆలోచించి, 'అదే చాలపొరపాటయింది' అన్నాడు.

'ఈ నాలుగు నెలలనుంచీ పొరబాటేనా ?'

'ఆఁ. అలాగే అయినట్లు కన్పిస్తోంది. ఆ సంగతి నాకు జ్ఞాపకం రాలేదు.'

మర్నాడు ప్రమీల చదవటానికి రాలేదు. ఆ సంగతి సురేంద్రుడు గమనించనే లేదు. ఆ మర్నాడు కూడా రాలేదు. ఆరోజునకూడా అంతే......

మూడోనాడు ప్రమీల కనపడకపోవటంచూసి, ప్రమీలను పిలుచుకుని రమ్మని ఒక నౌకరుతో చెప్పాడు సురేంద్రుడు.

నౌకరు లోపలకు వెళ్ళివచ్చి, 'చిన్నమ్మాయిగారు ఇంక మీదగ్గిర చదవరు' అని చెప్పాడు.

'అయితే ఎవరిదగ్గిర చదువుతుంది ?'

నౌకరు తన తెలివంతా ఉపయోగించి, 'మరో మేష్టారు వస్తారు' అన్నాడు.

అప్పుడు తొమ్మిది గంటలయింది. సురేంద్రుడు కాస్సేపాలోచించి, రెండుమూడు పుస్తకాలు చంకలో పెట్టుకుని లేచి నుంచున్నాడు. కళ్ళజోడుతీసి కేసులోపెట్టి, టేబిల్

మీద పెట్టేసి, మెల్లిగా వెళ్లిపోయాడు,

'ఈవేళప్పుడు ఎక్కడికి వెళుతున్నారు మేష్టరుగారూ?' అని అడిగాడు నౌకరు.

'బడదీదీతో చెప్పు - నేను వెళ్లిపోతున్నానని.'

మళ్లీ రారూ ?'

సురేంద్రుడికి ఈమాట వినిపించలేదు. సమాధానం ఇవ్వకుండా గేటుదాటి బైటికి వచ్చేశాడు. రెండు గంటలయింది. అయినా సురేంద్రుడు తిరిగిరాలేదు. అప్పుడు నౌకరువచ్చి మాధవితో 'మేష్టారుగారు వెళ్ళిపోయారని' కబురు అందించాడు.

'ఎక్కడికి వెళ్ళారు ?'

'అది తెలియదు. తొమ్మిది గంటలప్పుడు వెళ్లిపోయారు. వెళ్లేప్పుడు నేను వెళ్లిపోతున్నానని బడదీదీతో చెప్పమని నాతో చెప్పి వెళ్ళారు.'

'అదేమిటిరా ? భోజనం చెయ్యకుండానే వెళ్ళారా ?' అంటూ మాధవి ఉద్విగ్నురాలైంది.

తర్వాత ఆమె సురేంద్రుడి గదిలోకివచ్చి చూసింది - ఎక్కడి వస్తువులక్కడ అన్నీ అలాగే ఉన్నాయి. టేబిల్ మీద కళ్లజోడు కేసులో పెట్టిఉంది. కొన్ని పుస్తకాలు మాత్రం లేవు.

సాయంకాలమైయింది. రాత్రిఅయింది - సురేంద్రుడు రాలేదు. మర్నాడు యిద్దరు నౌకర్లను పిలిచి, "మీరు వెతికితీసుకువస్తే పదిరూపాయలు బహుమతి పొందుతారు. అని చెప్పింది.

బహుమూవంమీాది ఆశతో వాళ్లు పరుగెత్తారు. కాని సాయంకాలానికి తిరిగివచ్చి, ఎంత వెతికినా జాడదొరకలేదని చెప్పారు.

ప్రమీాల ఏడుస్తూ "ఆయన వెళ్లిపోయింది ఎందుకు ? అక్కా ! " అని అడిగింది.

మాధవి ప్రక్కకులాగి, 'బయటకు వెళ్ళు ఏడవకు' అన్నది. రెండురోజులు, మూడురోజులుగడచినదగ్గిర్నుంచీ క్రమశః ఆమె మరింత ఉద్విగ్నురాలు అవుతూవచ్చింది. 'బడదీదీ ! ఆయనకోసం ఇంత వెతకటమెందుకు? కలకత్తా నగరంలో మరోమాష్టరు దొరకరా ?' అన్నది బిందు. మాధవి కోప్పడి, 'పో అవతలికి ! ఒక మనిషిచేతిలో దమ్మిడీ అయినా లేకుండా వెళ్లిపోతే ఎందుకు వెతకట మంటావా నువ్వు ?' అన్నది.

"ఆయనదగ్గిర దమ్మిడీ అయినాలేదని నీకెలా తెలుసూ?'

"అది నాకుతెలుసు. కాని ఈ అనవసర ప్రసంగమంతా ఎందుకు నీకు?"

బిందుమాట్లాడకుండా వెళ్లిపోయింది. క్రమంగా వారం రోజులు గడిచిపోయినా సురేంద్రుడు రాకపోయేసరికి మాధవి ఒకవిధంగాఆహారాదులనువర్జించింది. సురేంద్రుడు నిరాహారంగా ఉంటూ ఉంటాడని ఆమెమనస్సుకుతట్టింది. ఈ ఇంట్లోనే కావలసిన వస్తువులను అడిగి తినలేనివాడు ఇతర్ల దగ్గిర అతడేమి అడగగలడు? కొనుక్కుని తినటానికి సురేంద్రుని దగ్గర డబ్బూలేదు, యాచించే సామర్థ్యమూ లేదు అతడికి - నిస్సహాయస్థితిలో ఉన్న కుఱ్ఱవాడిలాగా

ఏ 'ఫుట్ పాత్' మీదనో కూర్చుని ఏడుస్తూఉంటాడు. లేదా ఏ చెట్టుకిందనో పుస్తకాలు తలకిందపెట్టుకుని నిద్రపోతూఉంటాడు – అని ఆమె గట్టినమ్మకం. వ్రజరాజబాబు తిరిగివచ్చి, జరిగిన సంగతంతావిని, "జరిగినపని మంచిదికాదమ్మా!" అన్నాడు, మాధవి అతికష్టంమీద అశ్రువులను ఆపుకుంది.

ఇక్కడ సురేంద్రుడు రోడ్ల వెంట తిరుగుతున్నాడు. మూడురోజులు తిండిలేకుండా గడిపాడు. పంపుల్లో నీళ్లకు పైసా అక్కరలేదు. అంచేత ఆకలిఅయినప్పుడు కడుపు నిండా ఆనీళ్లే తాగేవాడు.

ఒకనాడు రాత్రి ఆలసిపోయిన దేహంతో కాళిఘాట్ వెడుతున్నాడు. అక్కడ తిండి దొరుకుతుందని ఎక్కడో విన్నాడు. గాఢాంధకారం, పైగా ఆందులో మేఘాలు కూడా బాగాకమ్ముకున్నాయి. చౌరంగీ మలుపులో ఒక గుర్రపుబండి అతడి మీదుగా పోయింది. బండీవాడు ఎలాగో గుర్రాలవేగాన్ని ఆపగలిగాడు. సురేంద్రుడికి ప్రాణాలుపోలేదు. కాని రొమ్ముమీద పెద్దదెబ్బతగిలి, స్పృహతప్పి పడిపోయాడు. పోలీసులువచ్చి, బండీమీద ఆస్పత్రికి తీసుకువెళ్లారు. నాలుగయిదురోజులు స్పృహలేని స్థితిలో గడిచాక రాత్రికళ్లువిప్పి 'బడదీదీ!' అన్నాడు.

కాలేజీలో విద్యార్థిఒకడు ఆరాత్రి డ్యూటీలోఉన్నాడు ఈమాట వినిదగ్గరకువచ్చినిలబడ్డాడు. "బడదీదీవచ్చిందా? అని అడిగాడు సురేంద్రుడు.

"రేపుపొద్దున్న వస్తారు"

మర్నాడు సురేంద్రుడికి బాగా తెలివి వచ్చింది. కాని బడదీదీ మాటఎత్తలేదు. పగలంతా తీవ్రమైన జ్వరంతో కొట్టుకుని, సాయంకాలమప్పుడు ఒకర్ని "నేనుఆస్పత్రిలో ఉన్నానా?" అని అడిగాడు.

"ఆఁ"

"ఎందుకు?"

"బండిక్రింద పడ్డారుమీరు."

"బ్రతికేఆశ ఉందా?"

"నిశ్చయంగా"

మర్నాడు ఆవిద్యార్థి దగ్గరకువచ్చి "మీవాళ్లు ఎవరైనా ఉన్నారా ఇక్కడ?" అని అడిగాడు.

"ఎవ్వరు లేరు?"

"అయితే అనాదురాత్రి బడదీదీ అనిపిలిచారెవర్ని? ఆమె ఇక్కడ ఉన్నారా?"

"ఉన్నారు. కాని. ఆమె ఇక్కడికిరాదు. మానాన్నకు కబురుచేస్తారా?"

"చేస్తాం"

సురేంద్రనాథుడు తండ్రిచిరునామా తెలిపాడు.

ఆవిద్యార్థి ఆరోజునే ఉత్తరం వ్రాశాడు. తర్వాత బడదీదీని వెతకి తీసుకురావాలని "ఇక్కడకు స్త్రీలు రావాలనుకుంటే రావచ్చు. మేమాపర్పాట్లు చేస్తాం. మీ పెద్ద అక్క చిరునామా తెలియచేస్తే ఆమెకూ్కడా కబురు అందచేస్తాం" అన్నాడు.

సురేంద్రనాథుడు కొన్నినిమషాలు ఆలోచించి వ్రాజ

బాబు అడ్రెస్ చెప్పాడు.

,,మా ఇల్లు వ్రిజబాబుగారింటిదగ్గరే, ఇవాళ వారికి మీస్థితి తెలియచేస్తాను రావాలనుకుంటే వారుచూడటానికి వస్తారు.'

సురేంద్రుడు మాట్లాడలేదు. మనస్సులో - బడదీదీ రావటం అసంభవం - అనుకున్నాడు. విద్యార్థి మాత్రం పాపంజాలికలిగి వ్రిజబాబుకు ఈసంగతి చెప్పాడు. వ్రిజ బాబు తుళ్లిపడి, "బ్రతుకుతాడా?" అని అడిగాడు.

"పూర్తిగాఉంది ఆ ఆశ."

ఇంట్లోకివెళ్లి కూతురుతో "మాధవీ! అనుకున్నంతా అయింది. సురేన్ బండికిందపడి, ఆసుపత్రిలో ఉన్నాడు' అనిచెప్పాడు.

మాధవి శరీరమంతా కంపించిపోయింది.

"నీపేరెట్టేకామోసు 'బడదీదీ' అని పిలిచాడట ! నువ్వుచూడటానికి వెడతావా? "

ఈసమయంలో ప్రక్కగదిలో ప్రమీల ఏదో గళ్లున క్రిందపడవేసింది. మాధవి అటుకేసి పరుగెత్తింది. చాలా సేపయింతర్వాత తిరిగివచ్చి, "నువ్వుచూసిరా. నేను రాలేను" అన్నది.

వ్రజబాబు దుఃఖంతోకూడిన నవ్వునవ్వి ,,అతడు అడివి మృగం. అతడిమీద కోపమెందుకు? " అన్నాడు.

మాధవి మాట్లాడలేదు. అయినా వ్రజబాబుఒంటరిగా సురేంద్రుడ్ని చూడటానికి వెళ్లాడు. చూసేసరికి చాలా దుఃఖంకలిగింది. ,,సురేన్, మీనాన్నకు కబురువెళ్లిందా?"

,,కబురు పంపాను''

,,భయంలేదు. ఆయనరాగానే ఏర్పాటుచేస్తాను.''

బ్రజబాబు డబ్బువిషయమై ఆలోచించి, ,,పోనీ, వారి చిరునామా చెప్పునాకు. వారు ఇక్కడకు రావటానికి అభ్యంతరాలేవీ లేకుండా చేస్తాను.'' అన్నాడు.

సురేంద్రుడు కీమాట అంతగా అర్థంకాలేదు. ,,నాన్న వస్తాడు. అభ్యంతర మేముంది?''

బ్రజబాబు ఇంటికితిరిగివచ్చి. మాధవికి జరిగిన సంగతంతా చెప్పాడు.

అప్పటినుంచీ రోజూఆయన ఒకసారి సురేంద్రుడ్ని చూడటానికి వెడుతున్నాడు. అతడిమీద ఒక విధమైన అనురాగంఏర్పడింది. ఒకరోజున ఇంటికివచ్చాక, ,,మాధవీ, నువ్వు యథార్థం తెలుసుకున్నావు. సురేన్ తండ్రి బాగా డబ్బుకలవాడు.'' అని చెప్పాడు.

మాధవి ఆతురతతో ,,ఎలా తెలుసు కున్నావు?'' అని అడిగింది.

,,అతడితండ్రి ఒక వకీలు. నిన్నరాత్రి వచ్చాడాయన'' మాధవి మౌనంవహించింది. 'సురేన్ ఇంటిదగ్గర నుంచి పారిపోయివచ్చాడు వాళ్లనాన్న చెప్పాడు' అన్నాడుతండ్రి

,,ఎందుకని?''

'అతడి తండ్రితో మాట్లాడాను ఇవ్వాళ. ఆయనే చెప్పాడుఈసంగతంతా. ఈ సంవత్సరమే యూనివర్సిటీలో కల్లా ఎమ్మే ఫస్టున ప్యాసయాడుటసురేన్. ఇంగ్లాండు వెడదామనుకుంటే, మరీ పరధ్యానం మనిషిఅని, తండ్రి

సాహసంచేసి పంపలేదు. అంచేత కోపంవచ్చి పారిపోయి వచ్చాడు. కులాసాచిక్కినాక అతడ్ని మళ్లీ ఇంటికి తీసుకెడతాడు' అన్నాడు వ్రజరాజబాబు. నిట్టూర్పును బిగబట్టుకుని, ప్రవాహంగా వస్తున్న అశ్రువులను ఆపుకుని 'అదేమంచిది' అన్నది మాధవి.

౬

సురేంద్రనాథుడు వెళ్ళి ఆరుమాసాలయింది. ఈలోపున మాధవి మనోరమకు ఒక్కసారిమాత్రం ఉత్తరం రాసింది. మళ్లీ రాయలేదు.

దసరాపండుగకు మనోరమ పుట్టింటికివచ్చి, మాధవిని వెళ్ళి పట్టుకుని 'నీకోతిని చూపించు' అన్నది.

మాధవినవ్వి, 'కోతి ఎక్కడిది?' అన్నది.

మనోరమ ఆమె గడ్డం పుచ్చుకుని మృదుస్వరంతో 'నీ ఎర్రకోతి, నీ చక్కని పాదాలదగ్గిర ఎంత అందంగా ఉందో చూద్దామని వచ్చాను శెలవుల్లో నేను' అని పాటగా పాడుతూ, 'నువ్వు పెంచావే ఆ కోతే' అన్నది.

'ఎప్పుడూ?'

మనోరమ నవ్వును ఆపుకుని. 'జ్ఞాపకంలేదూ? అతడు నిన్నుతప్ప ఎవర్నీ ఎరగడుగా?' అన్నది.

మాధవి చాలాసేపటికి గ్రహించింది. అంచేత కొంచెం కొంచెంగా ముఖం వివర్ణమయింది. అప్పటికీ నిగ్రహించుకుని 'ఓ - అతడిమాటా? అతడు తనంతట తానే వెళ్ళి

పోయాడు' అన్నది.

‹ఇంత అందమైన పాదాలు రెండూ అతడికి బాగుండ లేదా ?'

మాధవి ముఖంతిప్పుకుని మాట్లాడలేదు. మనోరమ ఆదరంగా చేత్తో ఆమె ముఖాన్ని సరిగ్గాంతిప్పి, పరిహాస మాడబోయి చూసేసరికి, ఆమె నేత్రాల్లోంచి నీళ్ళు కారు తున్నాయి. ‹ఇదేమిటి మాధవీ ?' అన్నది ఆశ్చర్యంతో.

మాధవి ఇహ ఆపుకోలేకపోయింది. ముఖానికి గుడ్డ అడ్డం పెట్టుకుని ఏడవటం మొదలెట్టింది.

మనోరమ ఆశ్చర్యానికి అంతులేదు. ఏమనాలోకూడా ఆమెకు తోచలేదు. కొంచెంసేపు ఏడవనిచ్చింది. తర్వాత బలవంతంగా ముఖంమీదినుంచి గుడ్డలాగి, ఎంతో దుఃఖ భావంతో, ‹ఒక మామూలు వేళాకోళాన్నే సహించ లేవా చెల్లీ !' అన్నది.

మాధవి కళ్ళు తుడుచుకుంటూ, ‹నేను వితంతువును అక్కా !' అన్నది. తర్వాత ఇద్దరూ మెదలకుండా ఊరు కున్నారు. ఇద్దరూ నిశ్శబ్దంగా ఏడవసాగారు. మాధవి దుఃఖంచూసి మనోరమ ఏడ్చింది - పాపం ఆమె విధవ అని కాని మాధవి దుఃఖానికి మరోకారణం ఉంది _ ఇప్పుడు తెలుసుకోకుండా మనోరమ - అతడు నిన్ను తప్ప ఎవర్నీ ఎరుగడు _ అని చేసిన పరిహాసాన్ని గురించే ఆలోచిస్తోంది ఈమాట నిజమే నన్నసంగతి ఆమెకూ తెలుసు. చాలాసే పయాక, 'కావి మంచిపనికాదు' అన్నది మనోరమ.

‹ఏపని ?'

'అదికూడా చెప్పాలా చెల్లీ? నేనంతా గ్రహించాను'

ఈ ఆర్నెల్లనుంచి ఏ విషయాన్ని ప్రాణ ప్రదంగా మాధవి దాచుకుంటూ వస్తున్నదో - దాన్ని ఇహ మనోరమదగ్గర దాచలేక పోయింది. ఆమెదగ్గరచ్చుబడి, ముఖం కప్పుకుని ఏడవటం మొదలెట్టింది. చిన్నపిల్లలాగా ఏడ్చింది.

చివరకు 'ఎందుకు వెళ్లారు?' అని అడిగింది మనోరమ

'నేను వెళ్ళమని చెప్పా'

'మంచిపని చేశావు - బుద్ధిమంతులు చెయ్యావలసిన పనేచేశావు'

మనోరమ ఏమీ గ్రహించలేదని మాధవి తెలుసుకుంది. అంచేత ఒక్కొక్కటే అన్నిసంగతులూ స్పష్టంగా చెప్పింది.

'కాని అతడు బ్రతకకపోయినట్లయితే బహుశా పిచ్చిదాన్ని అయిపోయేదాన్ననుకుంటాను' అన్నది.

'ఇప్పుడయితే మాత్రం అంతకన్న తక్కువేమిటి?' అనుకున్నది మనస్సులో మనోరమ.

ఆ రోజున ఆమె చాలా దుఃఖముతో ఇంటికి తిరిగి వచ్చింది. ఆ రాత్రే కాగితం, కలం తీసుకుని భర్తకు ఉత్తరం రాయాలని కూర్చుంది.

'స్త్రీలకు విశ్వాసం లేదని - మీరు చెప్పింది నిజమే. నేనుకూడా ఇవాళ అమాటే అంటున్నాను - ఎందుకంటే ఈ సంగతి నాకు మాధవి నేర్పింది. నేను ఆమెను చిన్నప్పటినుంచీ ఎరుగుదును. అంచేత ఆమెమీద దోషారోపణ చెయ్యాలనే ఇచ్ఛలేదు నాకు. అంత సాహసమూ లేదు.

ఈ దోషం స్త్రీజాతిమీదనే ఆరోపిస్తున్నాను—బ్రహ్మ మీద వేస్తున్నాను. ఆయన స్త్రీ హృదయాన్ని యింత కోమలంగా నీటిలాగా ఇంత తరళ పదార్థంతో ఎందుకు సృష్టించాడు? ఇ తటిప్రేమను సమకూర్చి ఈ హృదయం ద్రవించేట్లు సృష్టించాడు. ఈ హృదయాల్ని ఇంకొంచెం కఠినంగా నిర్మించాలని ఆయన చరణసన్నిధిని నా విన్నపం ఇహ మీ పాదసన్నిధిని నా విన్నపమేమంటే—మీ పాద సన్నిధిని నా శిరస్సును ఉంచి, మీ ముఖంకేసి చూస్తూ చనిపోవాలని...మాధవినిచూస్తే చాలా భయంవేస్తోంది. ఆమె నాకు అజన్మతః ఉన్న విశ్వాసాలనన్నీ తల్లక్రిందులు చేసింది. నన్ను మీరు ఆట్టే విశ్వసించవద్దు - వెంటనే వచ్చి తీసుకు వెళ్ళండి'

ఆమె జవాబు రాశాడు:

'అందమున్నవారు చూపెడతారు. గుణాలున్నవారు వెల్లడిస్తారు. ప్రేమఉన్నవాళ్లకే ప్రేమించటం తెలుసు—వాళ్లు ప్రేమిస్తారు. మాధవీలత రసాలవృక్షాన్ని అవలంబనంగా చేసుకోపటం ఈ ప్రపంచధర్మం. నువ్వూ, నేనూ ఏంచెయ్యగలం? నేను నిన్ను బాగా విశ్వసిస్తున్నాను. అందుకోసమని బెంగపెట్టుకోకు'

మనోరమ భర్తఉత్తరాన్ని శిరస్సున పెట్టుకుని, మనస్సులో ఆయన పాదాలను తలచుకుని నమస్కరించి — 'మాధవి దురదృష్టవంతురాలు. విధవలు చేయకూడనిపని ఏదో అదే చేసిందామె' అని రాసింది.

ఆ ఉత్తరం చూసుకుని మనోరమ భర్త లోపల్లోపల

నవ్వుకున్నాడు - తరువాత కుతూహలంకొద్దీ రాశాడు - మాధవి దురదృష్టవంతురా లనటంలో సందేహం లేదు. ఎందుకనంటే - వితంతువై ఉండికూడా మనస్సులో మరొకర్ని ప్రేమించింది. నీకు కోపం వచ్చేమాటే - విధవ అయి ఉండికూడా మీ సధవల అధికారంలో జోక్యం కలిగించు కుందికదూ మరి! నేను బ్రతికి ఉన్నన్నాళ్లూ నీకు దిగులు లేదు - నీ సదవకాశాలు వదులుకోనవసరంలేదు! ఈ లోపున అవకాశాన్ని చూసుకుని మరొకర్ని లోపల్లోపల ప్రేమిస్తూవుండు: కాని ఎందుకనో నువ్వు నాకుఆశ్చర్యాన్ని కలిగించలేకపోయావు. నేను ఒకసారి ఒక లతనుచూశాను అది మొలుపొడుగున నేలమీద పాకిపాకి, చివరకు ఒక వృక్షాన్ని పెనవైచుకుంది. ఇప్పుడు దాని కెన్ని ఆకులు, ఎన్ని పూలగుత్తులు! నువ్వు ఇక్కడకు వచ్చినప్పుడు ఇద్దరం కలిసి వెళ్లి చూసివద్దాం!

మనోరమకు కోపం వచ్చి ఆ ఉత్తరానికి సమాధానం ఇవ్వలేదు.

కాని మాధవి కనుకొలకులు నల్లపడ్డాయి. ప్రఫుల్లంగా ఉండే ముఖం ఈషత్ గంభీరాకృతి వహించింది. పనుల్లో అంత నియమం లేదు. కొంచెం అలక్ష్యంకూడా హెచ్చింది అందరివిషయంలోనూ, ఆదరం, ఆత్మీయత చూపించాలనే ఇచ్ఛ అలాగేఉంది. పైగా కొంచెం ఎక్కువయిందికూడా కాని పనులన్నీ పూర్వంలాగా జ్ఞాపకం ఉండటంలా - మధ్యమధ్య మరుపుకూడా వస్తూఉండేది.

అందరూ ఇప్పుడూ బడదీదీ అంటున్నారు. ఇపుడూ

అంతా ఆ కల్పవృక్షంకేసి చూస్తున్నారు. అభీష్టఫలాన్ని పొందుతున్నారు. కాని ఆ వృక్షంమాత్రం అంత నవనవ లాడుతూ తేజోవంతంగా లేదు. వృద్ధులుమాత్రం మధ్య మధ్య ఈ వృక్షం ఎండిపోతుందేమో అని శంకించేవారు.

మనోరమ రోజూవస్తోంది. ఏవేవో మాట్లాడుతుంది. ఈవిషయంమాత్రం తీసుకొచ్చేదికాదు. మాధవికి దుఃఖం కలుగుతుంది అని మనోరమకు తెలుసు. అంచేత ఈ విష యాలన్నీ ఎత్త ఆలోచించకుండా ఉంటే అంత మంచిది. హతభాగిని మరిచిపో గలదనికూడా మనోరమ భావించేది.

సురేంద్రనాథుడు ఆరోగ్యంపొంది తండ్రితోకూడా ఇంటికి వెళ్లిపోయాడు. సవతితల్లి తన ఆదరాన్ని కొంచెం తగ్గించ సాగింది. అంచేత కూడా సురేంద్రుడు కొంచెం ఆరోగ్యం పొందగలిగాడు. కాని శరీరం ఇంకా బాగా నయంకాలేదు. గుండెల్లో కొంచెం నొప్పిఉంది. సౌందర్య యౌవనకాంక్ష, పిపాస అతడిహృదయంలో ఇంకా అవిర్భ వించలేదు. ఇవన్నీ అతడికి తెలియవు. మునుపటిలాగా ఇప్పుడుకూడా అన్యమనస్కుడు. తనభారం తాను వహించ లేనివాడే. కాని ఎవరిమీద ఆధారపడి ఉండాలో అది మాత్రం ఎంత ఆలోచించినా తోచలేదతడికి. తోచలేదు కదా అని, అతడే తన పనులన్నీ తనే చూసుకునేవాడా అంటే అదీలేదు. నేడూ ఇతర్లవంకేచూస్తున్నాడు. కాని మునుపటిలాగా ఇప్పుడూ శ్రద్ధవహించటంలేదు. పనుల్లో ఎక్కడన్నా కొంచెం పొరబాటు జరిగినట్లు కనపడితే కాస్త వణుక్కుంటున్నాడు. అతడి సవతితల్లి ఇది చూసినప్పు

డల్లా 'సురో ఇప్పుడు మారిపోయాడు' అని వ్యక్తంచేస్తూ ఉంటుంది.

ఈమధ్య ఒకరోజున అతడికి జ్వరంవచ్చింది. చాలా బాధపడ్డాడు. కళ్ళవెంబడి నీళ్ళుకూడా వచ్చాయి. సవితి తల్లి దగ్గరేకూర్చుని ఉంది. ఆమె ఒక కొత్తవిషయం కని పెట్టింది ఒక్క క్షణమయ్యేసరికి ఆమె కళ్ళవెంబడికూడా నీళ్లు వచ్చాయి. ఆదరపూర్వకంగా అతడి కన్నీళ్ళుతుడిచి 'సురో! ఎందుకు నాయనా!' అన్నది. సురేంద్రుడు మాట్లాడలేదు తర్వాత ఒక పోస్టుకార్డు అడిగి తీసుకుని, వంకరటింకర అక్షరాలతో 'బడదీదీ-మళ్ళీ జ్వరంవచ్చింది, చాలా బాధగా ఉంది' అని రాశాడు.

ఉత్తరం పోస్టాఫీసుకుచేరలేదు. మొదట్లో పక్కమీద నుంచి టేబిల్ మీదకు వెళ్ళింది. తర్వాత ఇల్లు ఊడ్చేదాసీది వచ్చి దానినికూడా బిస్కట్ ముక్కలతో, ద్రాక్షతొక్క లతోపాటు కలిపి ఊడ్చేసి బైట పారేసింది సురేంద్రుడి ప్రాణప్రదమైన ఆ కాంక్ష, దుమ్ముకొట్టుకుని, గాలికెగిరి, మంచుకు తడిసి చివరకు ఒక చెట్టుక్రిందపడి ఉండిపోయింది

మొదట్లో ఒక సాకారమూర్తి సమాధానంగా వస్తుం దని ఎదురుచూస్తూకూర్చున్నాడు తర్వాత కొన్ని అక్ష రాలు అయినా రాకపోతాయా అని ఆశించాడు. కాని ఏమీ రాలా క్రమశః అతడి జ్వరం తగ్గిపోయింది పథ్యం పుచ్చుకుని లేచాడు.

తర్వాత అతడి జీవితంలో ఒక కొత్తసంఘటన జరిగింది. ఆ సంఘటన కొత్తదే కాని చాలా స్వాభావికమైనది.

సురేంద్రుడి తండ్రి రాయ్ మహాశయుడు ఇది చాలారోజు ల్నుంచీ ఎరుగు - ఇదే ఆశిస్తున్నాడుకూడా. సురేంద్రుడి మాతామహుడు పాబనా జిల్లాలో ఒకమధ్యరకం జమీందారు. ఇరవై, ఇరవై అయిదు ఊళ్లు జమీ ఉంది. ఏటా ఆదాయం ఇంచుమించు నలభై, యాభై వేలు ఉంటుంది. అతడు అపుత్రకుడు. స్వభావసిద్ధంగా చాలాతక్కువఖర్చు చేసే మనిషి. అంచేత అతడు లోభి అని ప్రసిద్ధిఉంది. అంచేత అతడు తన సుదీర్ఘజీవితంలో చాలా డబ్బు నిలవ చేసి ఉంచాడు. అతడి తదనంతరం సమస్తఐశ్వర్యం ఏక మాత్ర దౌహిత్రుడే పొందగలుగుతాడు అని రాయ్ మహాశయుడికి నిశ్చయంగా తెలుసు. అంతే జరిగింది మామగారు మృత్యుశయ్యాగతులై ఉన్నారని రాయ్ మహాశయుడికి కబురు వచ్చింది. వెంటనే కొడుకుని తీసుకుని పాబనా జిల్లాకు ప్రయాణమైనాడు. కాని అక్కడికి ఇంకా చేరకముందే మామగారు పరలోకగతులైనారు.

శ్రాద్ధ-శాంతులు చాలా గొప్పగా జరిగాయి. అసలే బందోబస్తుగా ఉన్న జమీందారీ. పైగా పరిపక్వబుద్ధియైన వృద్ధవకీలు మహాశయుడి బందోబస్తుకు ప్రజలంతా భయపడిపోయారు ఇప్పుడు సురేంద్రుడికి పెళ్ళిఅవటంఅవసరం సంబంధాలు కుదిర్చేవారి రాకపోకలతో ఊరంతా హడావుడిగా ఉంది. యాభైకోసులమధ్య ఏ ఇంట్లో ఒక అందమైన పిల్ల ఉన్నదన్నా, ఈ కుదిర్చేవాళ్లజట్టు ఆ ఇంటి మీదికి వెళ్లిపడి, ఆ పిల్ల తల్లిదండ్రులకు ఆశలు పెట్టడం మొదలెట్టారు. ఈ విధంగా ఆరునెలలు గడిచిపోయాయి.

55

బ

చివరకు సవితితల్లి వచ్చింది
వచ్చారు. బంధువులతో ఇల్లంతా

తర్వాత ఒకరోజున ఉదయం పె
మారుమ్రోగేట్లు చేస్తూ సురేంద్రుడు వివాహం చేసుకొని
తిరిగివచ్చాడు.

8

ఇంచుమించు అయిదు సంవత్సరాలు గడిచిపోయాయి. రాయ్ మహాశయుడు చనిపోయాడు — వ్రజబాబుకూడా స్వర్గస్థుడైనాడు. సురేంద్రుడి సవితతల్లి భర్త ఇచ్చిపోయిన సంపదను, ధనాన్ని తీసుకుని పుట్టింట్లో ఉంటోంది.

ఇప్పుడు సురేంద్రనాథుడికి ఎంత ప్రఖ్యాతి ఉందో అంత అపఖ్యాతికూడా ఉంది. ఇంత అమాయకుడు, సుహృద్వత్సలుడు, ఉదార మనస్సుతో పోషించే జమీందారు మరొకడు లేడని కొంతమంది చెప్పుకుంటారు. మరి కొంతమంది - ఇలా ప్రజలనుపీడిస్తూ అత్యాచారాలుచేసే జమీందారెవడూ మరొకడు ఈ జిల్లాలోనే పుట్టలేదని — అంటూఉంటారు.

ఈ రెండు రకాలమాటలూ నిజమే నాకుతెలిసినంతలో ...ఒకటి సురేంద్రనాథుడి విషయంలో నిజం మరొకటి అతడి మేనేజరు మథురనాథబాబు విషయంలో సత్యం.

సురేంద్రనాథుడి బైఠక్ ఖానాలో ఆంతరంగికమిత్రులు చాలామంది సమావేశమవుతూఉంటారు. వాళ్లు మహా

...లన్నీ తీర్చుకుంటూ ఉంటారు.
...ంచీ, మదమాంసాలవరకు — ఏ
...లోచించవలసిన అవసరమూ లేదు.
...సిన అగత్యమూ లేదు. వారి నోటిదగ్గిరకు వాటం
తటవే వస్తాయి.

మేనేజరు మథురబాబుకు ఇలాంటివంటే చాలా ఉత్సాహం. ఖర్చు చెయ్యటంలో అతడిది ముక్తహస్తం. కాని వీటికోసం జమీందారు నష్టపడేదేమీ లేదు. అతడి శాసనాన్ననుసరించే ప్రజలే ఆ ఖర్చును భరిస్తూ ఉంటారు. మథురబాబు దగ్గర ఒక్క దమ్మిడీ అయినా బాకీలుపెట్టడమనేది లేదు. ఇళ్ళు తగలపెట్టించటంలో, వేలాలు వేయించటంలో కచేరీకి సంబంధించిన గదుల్లో బంధించటంలో — అతడి సాహసానికీ, ఉత్సాహానికీ అంతులేదు.

ప్రజల ఆక్రందనం మధ్యమధ్య శాంతిదేవి చెవులపడుతూ ఉండేది. ఆమె భర్తను బ్రతిమాలుతూ 'మీరు స్వయంగా జమీందారీ వ్యవహారాలు చూసుకోకపోతే అంతా నాశనమైపోతుంది' అని చెబుతూ ఉండేది.

సురేంద్రనాథుడికి ఏదో మత్తువదిలినట్లుండేది 'అలాగా అలాగా! ఈ సంగతులన్నీ నిజమేనా?' అనేవాడు.

'నిజం కాదూ! దేశమంతా నిందిస్తున్నా, ఇవన్నీ మీ చెవినిమాత్రం పడలా! ఇరవైనాలుగ్గంటలూ, స్నేహితుల్ని పెట్టుకు కూర్చుంటే ఇవన్నీ ఎవరు వినిపిస్తారు మీకు? ఇలాంటి మేనేజరు వద్దు మనకు. వెళ్ళగొట్టించెయ్యండి.'

సురేంద్రుడు గాబరాపడి 'అలాగా! రేపటినుంచి

స్వయంగా నేనే అన్నీ చూసుకుంటాను’ అనేవాడు తరువాత కొన్నాళ్ళు జమీందారీ చూసుకోవటంలో మునిగి తేలుతూ ఉండేవాడు. మథురబాబు విచారపడుతూ, గంభీరంగా అప్పుడప్పుడు ‘సురేన్ బాబూ! ఇలాఅయితే జమీందారీ నిలబెట్టుకోగలరా? అనేవాడు.

సురేంద్రుడు శుష్కంగా నవ్వి ‘దుఃఖితుల రక్తంపిండే ఈ జమీందారీతో ఏమిటి ప్రయోజనం మథురబాబూ!’ అంటూ ఉండేవాడు.

‘అయితే నాకు శలవిప్పించండి. నేను వెళ్లిపోతాను.

అలాంటప్పుడు సురేంద్రుడు మెత్తపడేవాడు. తర్వాత మళ్ళీ యథాప్రకారమే. సురేంద్రనాథుడు బైఠక్ ఖానా నుంచి బైటికి వచ్చేవాడు కాదు ఇహ.

ఇప్పుడు మళ్లీ మరోకొత్త ‘ఉపసర్గ’ వచ్చిచేరింది. తోటలో ఒకయిల్లు తయారైంది. అందులోకి కలకత్తా నుంచి ఎలోకేశి అని ఒకమనిషి ఎవరోవచ్చింది. నాట్యంలోనూ, గానంలోనూ మంచి ప్రవీణురాలు. చూడటానికి కూడా అంత ఇదిగా ఉండదు. దులిపిన తేనెపట్టులాగా బైఠక్ ఖానా వదలి మిత్రబృంద మంతా గుంపుగాపోయి ఆతోటలో వాలేవారు. వాళ్ల ఉత్సాహానికి, ఆనందానికి అంతులేదు. సురేంద్రనాథుణ్ణికూడా వీళ్లంతా కలిసి అక్కడకు లాక్కుపోయారు. మూడురోజులనుంచీ శాంతికి భర్త దర్శనం లభించలేదు, నాలుగోరోజున మధ్యాహ్నం భర్త ఇంటికి వచ్చేసరికి- గుమ్మానికి ఆనుకుని నిలబడి, ‘ఇన్నాళ్లూ ఎక్కడున్నారు?’ అని అడిగింది శాంతి.

'తోటలో ఉన్న మేడలో.'

'అక్క డెవరున్నారు - మూన్నాళ్లనుంచీ పడిఉండ టానికి?'

'అదే -'

'అన్ని ప్రశ్నలకూ అదే! నేనంతా విన్నాను.' అని ఏడుస్తూ 'నన్ను కాళ్లతో ఇలా నెట్టివేయటానికి నేనేం తప్పుచేశాను?' అంది.

'ఎక్కడా అలా నేను-'

'ఇంతకన్న కాళ్ళతో నెట్టివేయడ మంటే ఏమిటి? మాకు ఇంతకన్న అవమానం ఇంకేముంది?'

'అదే! ఆ - వాళ్ళందరూ -'

శాంతి ఇంక ఆ మాటవినలేదు. మరీ ఏడుస్తూ, 'మీరు నాభర్త - నా దైవము. నాకు ఇహమూ - పరమూ మీరే. నేను మిమ్మల్ని అర్థంచేసుకో లేదనుకున్నారా? నేను మీ కేమీ కానని నాకు తెలుసు. ఒక్కనాడైనా మీ మన స్సును పొందలేక పోయాను. ఈ బాధ మీకెలా చెప్పను? వింటే మీరు సిగ్గుపడతారేమో, మీకు కష్టం కలుగుతుం దేమోననే మీ కేమీ చెప్పలేదు' అన్నది.

'శాంతీ! ఎందుకు ఏడుస్తావు?'

'ఎందుకేడుస్తున్నానా? అంతర్యామికి తెలుసు. మీరు అనాదరణ చూపరనీ తెలుసు నాకు - మీకూ మనస్సులో దుఃఖం ఉంది - మీరింక ఏంచేస్తారు?' అని కళ్లు తుడుచు కుని, 'నేను పుట్టినప్పటినుంచీ కష్టాలు పడుతూనే ఉన్నా. అందువల్ల నష్టమేమీ లేదు. కాని మీ మనస్సులో ఉన్న

కష్టమేమిటో తెలుసుకో గలిగితే_'

సురేంద్రనాథు డామెను దగ్గరకు తీసుకుని, ఆమె కళ్ళు వ్వయంగా తుడుస్తూ_'అలా అయితే ఏంచేస్తావు శాంతీ?' అన్నాడు.

ఈ మాటకింక సమాధాన మేమిటి? శాంతి వెక్కి-వెక్కి ఏడ్చింది.

ఇలా చాలాసేపు గడిచాక, 'ఇప్పుడు మీ ఒంట్లో కూడా అంతగా బాగుండలేదు' అన్నది శాంత.

'ఇవాళే అన్నమాటేమిటి? అయిదుసంవత్సరాలనుంచీ అలాగే ఉంది. కలకత్తాలో బండికింద పడితే గుండెకు దెబ్బ తగిలి నెల్లాళ్ళు మంచంలోపడి ఉన్నప్పటినుంచీ బాగుండటమే లేదు. ఆ నొప్పి అలాగేఉంది. ఎలా బ్రతికి ఉన్నానా అని మధ్యమధ్య నాకే ఆశ్చర్యం వేస్తూ ఉంటుంది.'

శాంతి చటుక్కున భర్తరొమ్ముమీద చెయ్యిపెట్టి, 'ఈ ఊరు విడిచిపెట్టి మనం కలకత్తా వెడదాం. అక్కడ పెద్దపెద్ద డాక్టర్లు ఉన్నారు_' అంది.

సురేంద్రుడు చటుక్కున సంతోషంతో_'అయితే పద! అక్కడ బడదీదీ కూడా ఉంది' అన్నాడు.

'మీ బడదీదీని చూడాలని నాకుకూడా చాలా రోజుల నుంచి కోరికగాఉంది. ఆమెను తీసుకువస్తారా?'

'తీసుకురాక పోవడమేమిటి?' అని మళ్ళీ కాస్సేపాలోచించి, 'తప్పకుండా వస్తుంది. నేను చచ్చిపోతున్నానని వింటే——'

శాంతి అతడి నోటికి చెయ్యి అడ్డుపెట్టి_ మీ కాళ్ళ

మీద పడతా. ఇంక అవన్నీ అనకండి' అన్నది.

'ఆఁ. ఆమె కనుకవస్తే ఇంక నాకే కష్టమూ ఉండదు.'

శాంతి హృదయం అభిమానంతో నిండిపోయింది. భర్తకు తానేమీ కాదని మాత్రమే అన్నది. కాని సురేంద్రుడు అంతదూరం ఆలోచించనూ లేదు - గ్రహించనూ లేదు. తాను చెప్పేగానికే మహాఆనందం కలిగింది. 'నువ్వే స్వయంగా వెళ్లి బడదీదీని పిలుచుకురా! ఏమంటావు ?' అన్నాడు. శాంతి తలఆడిస్తూ సరేనంది.

'ఆమె వచ్చిచూస్తే ఇంక నాకే కష్టమూ ఉండదు_'

శాంతి కళ్ళు కాల్వలు కట్టాయి. డాన్నాడు ఆమె దాసీదాని ద్వారా, 'తోటలో మేడలోనికి తీసుకువచ్చిన మనిషిని తత్‌క్షణమే [illegible]గొట్టపోతే ఇంక తాను మేనేజరుగా ఉండనవసరం లేదని మధుర బాబుకు కబురువంపించింది. 'ఏమయినా సరే ఇంక మీారు ఇల్లుకదిలి వెళ్లారంటే నేను తల పగలకొట్టుకుని చస్తా' నని భర్తను బెదిరించింది.

'అదే_కాని వాళ్ళు_'

'ఆఁ 'కాని' ఏమిటో నేను చూస్తాను' అని శాంతి దాసీదాన్ని మళ్ళీ పిలిచి, 'ఈ దౌర్భాగ్యులను ఇంక మన ఇంట్లో అడుగుపెట్టనివ్వ వద్దని దర్వాన్‌తో చెప్పు' అని హుకుం పంపించింది.

ఇంక గత్యంతరంలేక మధురబాబు ఎలో కేశిని పంపించి వేసాడు. మిత్ర బృందంకూడా ఎక్కడివాళ్ళు అక్కడ మాయమయ్యారు. ఆ తర్వాత ఇంక సురేంద్రుడు మామూలుగా జమీందారీ వ్యవహారాలలో శ్రద్ధవహించాడు.

ప్రస్తుతం సురేంద్రుడు కలకత్తా వెళ్ళటం సాగలేదు. గుండెల్లో నొప్పి మొత్తానికి కొంచెం తగ్గినట్లుగా ఉంది. శాంతకికూడా కలకత్తా వెళ్ళటం ఇప్పుడంత ఉత్సాహంగా లేదు. ఇక్కడ ఉండే తనకు సాధ్యమైనంతవరకు భర్తకు ఉపచారాలు చేయసాగింది. కలకత్తానుంచి ఒక పెద్దడాక్టరు వచ్చి చూసాడు. ఆయన అతణ్ణి పరీక్షించి, మందూ మాకూ ఏర్పాటుచేసి, ప్రత్యేకించి ఆయన గుండెస్థితినిబట్టి శారీరక పరిశ్రమకాని, మానసిక పరిశ్రమకాని చేయకూడ దని సలహా ఇచ్చాడు.

మళ్లీ అవసరాన్నిబట్టి మేనేజరే వ్యవహారాలు చూడ సాగాడు. అంచేత ప్రతిఊళ్లోను హాహాకారాలు ద్విగుణంగా చెలరేగాయి. శాంతి ఇవన్నీ మధ్యమధ్య వింటున్నా భర్తకు చెప్పటానికి సాహసించ లేకపోయింది.

౭

కలకత్తాలో వ్రజబాబుగారి ఇంట్లో ఆయనస్థానంలో ఇప్పుడు శివచంద్రుడు యజమాని మాధవికి బదులు శివ చంద్రుడి భార్య యజమానురాలు. మాధవి ఇంకాఇక్కడే ఉంది. అన్న శివచంద్రుడు ఆదరాభిమానాలు చూపు తూనే ఉన్నాడు. కాని మాధవికి ఇంకా ఇక్కడఉండటం మనస్కరించటంలేదు. ఇంట్లోఉండేదాసదాసీలు, గుమాస్తా మేనేజరు ఇప్పటికి బడదీదీ అనే పిలుస్తున్నారు. కాని, ఇప్పుడు ఇనప్పెట్టెతాళంచెవి మరొకరి దగ్గరుందని అందరికీ

తెలుసు. అలా అని, శివచంద్రుడిభార్య మాధవికి అవజ్ఞాకాని, అమర్యాదకాని చేస్తున్నదా అంటే అదీలేదు. కాని యిప్పుడు ఆమె కన్నరచేభావాన్నిపట్టి, ఈ నూత్న వధువు అనుమతీ సలహాలేనిదే ఏపనీ చెయ్యటానికి ఆమె కేమాత్రం వీలులేదని మాత్రం స్పష్టంగా తెలుసుకోవచ్చు.

అప్పుడు తండ్రి అధికారం ఉండేది. ఇప్పుడుఅధికారం అన్న చేతుల్లోకి వచ్చింది. పనుల్లోకొంచం వత్యాసం ఏర్పడింది. మొదట్లో ఆదరమూ ఉండేది. పెత్తనమూ ఉండేది - ఇప్పుడు ఆదరమైతేఉందిగాని, పెత్తన మాత్రం లేదు అప్పుడు తండ్రి ఆదరమంతా ఆమె ఒక్కతెమీదనే ఇప్పుడు కుటుంబబంధువుల్లో తానుకూడా ఒకతెఅయింది.

నేనుశివచంద్రుణ్ణికాని, అతడిభార్యానుకాని, తప్పుపడుతున్నానని సూటిగా కాకుండా అన్యాపదేశంగా డొంకతిరుగుళ్ళుగా దూషిస్తున్నానని కాని ఎవరైనా అనుకునేట్లయితే — వాళ్లు నన్ను పొరబాటుగా అర్థంచేసుకున్నట్లే. ప్రపంచలో ఏనీతినియమాలు, ఏరీతి రివాజులూ ఈనాటివరకూ వస్తున్నాయో వాటినిమాత్రమే ఇక్కడ ఉల్లేంగిస్తున్నాను. మాధవి గీత మంచిదికాదు. ఆమెకు నాదిఅని చెప్పుకునేందుకు ఏమీ లేదు. అలాఅని ఇతరులు తమఅధికారాలను ఎందుకు వదలుకుంటారు? భర్తఆస్తిమీద భార్యాకు అధికారమని వాళ్లు ఎరగరూ? శివచంద్రుడి భార్యాకుమాత్రం ఈవిషయం తెలియదూ? శివచంద్రుడు మాధవికి అన్నగారైతే అవచ్చు. కాని ఆమె మాధవికి ఎవరు? ఇతరులకోసం

ఆమెతన అధికారం ఎందుకు వదులుకుంటుంది? మాధవి అన్నీ గ్రహించింది. కోడలు చిన్నతనంలో ఉండగా - వ్రజ బాబు బ్రతికేఉన్నాడు. అప్పుడు మాధవిదగ్గర ప్రమీలకు ఆమెకు అట్టే భేదంలేదు. ఇప్పుడు అభిప్రాయాలు కలవ టంలా. ఆమె మొదటినుంచీ అభిమానవతి. అంచేత ఆమె అందరికీతగ్గి ఉండేది. మాటపడే ఓర్పులేదు. అంచేత ఆమె అంతగా మాట్లాడేదికాదు. తనకుబలంలేనిచోట, తాను తల ఎత్తుకు తిరుగుదామంటే, ఆమెకు తలతీసేసినట్లు ఉంటుంది! మనస్సుకేదైనా కష్టంతోస్తే మొదలకుండా సహించేదికాని, శివచంద్రుడితో ఏమీ చెప్పేదికాదు. ఆత్మీయుతలో సహాయాన్ని అర్థించటం ఆమెకు అలవాటు లేదు. అంచేత ఆత్మీయుతను ఆధారంచేసుకుని, అధికారము చెలాయించుదామంటే ఆమెశరీరము, మనస్సూకూడా తిరస్కృతిచూపేవి. సామాన్యస్త్రీలలాగా తగాదాలు పెట్టుకోవడమన్నా, కలహించుటమన్నా ఆమెకెంత అస హ్యమో అది ఆమెకు మాత్రమే తెలుసు.

ఒకనాడు మాధవి శివచంద్రుణ్ణి పిలిచి, 'అన్నయ్యా నేను మా అత్తగారింటికి వెడతాను.' అని చెప్పింది. శివ చంద్రుడు విస్మితుడై 'అదేమిటి మాధవీ! అక్కడ ఎవ రున్నారు?' అన్నాడు మాధవి చనిపోయినభర్తను ఉద్దేశించి' వారి చిన్నచెల్లెలు మేనల్లుడు కాశీలో ఉంటు న్నారు. వాళ్లనుతీసుకువచ్చి నేను గోలాపూర్‌లోఉంటాను అంది.

పాబనాజిల్లాలో గోలాపూర్‌లో మాధవి అత్తగారి

ఇల్లు. శివచంద్రుడు కొంచం నవ్వి, ‹అదేలా? అక్కడ నీకు చాలాకష్టమవుతుంది.' అన్నాడు.

'కష్టమేముంటుంది అన్నయ్యా? ఇల్లుఇంకా పడిపోకుండా ఉందికదా. పదివన్నెండెకరాల భూమికూడా ఉంది. ఒక విధవకు దానితో జరగదా?'

'గడవటంసంగతికాదు. డబ్బు విషయమూకాదు. కాని నీకుచాలా కష్టమవుతుంది మాధవి!'

'ఏమాత్రం కష్టం ఉండదు''

శివచందు్రిడు కొంచం ఆలోచించి, 'ఎందుకు వెడుతున్నావు చెల్లీ? నాకుఅంతా విడమర్చిచెప్పు. నేను అన్నీ సరిచేస్తాను.' అన్నాడు. ఇంతకుమునుపే బహుశా భార్యాదగ్గిర చెల్లెలివిషయమై విరుద్ధంగా ఏదోవిని ఉంటాడు. బహుశా అదేజ్ఞప్తికి వచ్చిందేమో. సిగ్గుతో మాధవిముఖం ఎర్రబడింది. 'అన్నయ్యా! నేను పోట్లాడి నీయింట్లోంచి వెళ్లిపోతున్నాననుకుంటున్నావా?' అన్నదామె.

ఆమాటకు శివచంద్రుడు కూడా శిగ్గుపడ్డాడు. చటుక్కున కాదు, కాదు అదికాదు. నేను ఆమాట అనలేదు ఇది మొదటనుంచీ నీఇల్లే, అలాంటిఅప్పుడు ఇవ్వాళ ఎందుకు వెళ్లాలనుకుంటున్నావ్?' అన్నాడు. ఇద్దరికిఒక్కసారే తండ్రివిషయం జ్ఞాపకం వచ్చింది. మాధవికళ్లు తుడుచుకొని' మళ్లీవస్తాను. నీకొడుక్కి ఉపనయనం చేసుకునేప్పుడు తీసుకువద్దువుగాని - ఇప్పుడు వెడతాను' అన్నది.

'అది ఇంకా ఏడెనిమిదేళ్ళ సంగతికదా!'

‹బ్రతికిఉంటే తప్పకుండా వస్తాను.'

ఎలా చూసినా మాధవి ఇక్కడ ఉండటానికి సమ్మ తించలా. వెళ్ళిపోదామనే ప్రయత్నించ సాగింది. శివచం ద్రుని భార్యకు సంసారమంతా అప్పగించింది. దాసదాసీ లను పిలిచి ఆశీర్వదించింది. ఆఖరిరోజున శివచంద్రుడు అశ్రుపూర్ణ నేత్రాలతో చెల్లెలిదగ్గరకు వచ్చి, 'మాధవీ, నీ అన్న నిన్నెప్పుడూ ఏమీ అనలేదు కదా ?' అన్నాడు.

'అదేంమాట అన్నయ్యా !' అన్నది మాధవి.

'అది కాదు. ఏ అశుభక్షణంలో నయినా, ఏ రోజు నయినా నా నోటిమీదుగా అనాదరంగా ఏమైనా–'

'లేదు. అన్నయ్యా ! అదంతా ఏమీలేదు.'

'నిజమేనా ?'

'నిజం !'

'అయితే వెళ్ళు. నీ ఇంటికి నువ్వు వెడుతూంటే నేను వద్దు అనను. నీ కెక్కడ బాగుంటే అక్కడే ఉండు. అయితే ఎప్పుడూ కబుర్లు తెలియచెయ్యటం మాత్రం మరిచిపోకు'

మాధవి ముందు కాశీ వెళ్ళి మేనల్లుణ్ణి వెంటపెట్టుకుని గోలాపూర్ వచ్చి - ఏడు సంవత్సరాలు గడిచాక భర్త ఇంట్లో ప్రవేశించింది మళ్ళీ.

అప్పుడు గోలాపూర్‌లో ఛటర్జీ మహాశయుడికి చాలా ఆపద సంభవించింది. ఆయన, యోగీంద్రుడి తండ్రి చాలా స్నేహితులు. అంచేత చనిపోయేముందు యోగీంద్రుడు తనకున్న భూమి ఏదో అతడిచేతిలో వదలి పోయాడు. యోగీంద్రనాథుడు బ్రతికఉన్నప్పుడు అన్నీ అతడే 'మేనేజ్'

చేస్తూ ఉండేవాడు. యోగీంద్రుడు వాటి అన్నిటి విష యాల్లో ఆట్టే పట్టించుకునేవాడు కాదు. మామగారు చాలా భాగ్యవంతుడు. అంచేత ఈ పితృదత్తమైన యీ కొద్దిపాటి ఆస్తిని అతడు దృష్టిలో ఉంచుకునేవాడు కాదు. అతడు చనిపోయిం తర్వాత ఛటర్జీ మహాశయుడు, అతి న్యాయంగా ఏవిధమైన అభ్యంతరాలూ లేకుండా అన్ని విధమైన హక్కులను దఖలు పరుచుకుని అను భవిస్తున్నాడు. ఇప్పుడు వితంతువైన మాధవి ఇన్నాళ్ళ యాక వచ్చి అడ్డుతగిలింది. అంచేత ఇది ఛటర్జీ మహాశ యుడికి చాలా అన్యాయంగా తోచింది. మాధవి కక్ష కొద్దీ ఇలాచేసిందని అతడు స్పష్టంగా తెలుసుకున్నాడు. అతి పిరకుడై వచ్చి - 'అదే! నీకున్న రెండెకరాల భూమి మీాద పదిసంవత్సరాల శిస్తు బకాయిపడి, వడ్డీతో సహా వందరూపాయలు బాకీ తేలింది. అదికనుక చెల్లించకపోతే భూమి వేలం అవటానికి సిద్ధంగాఉంది' అన్నాడు. మాధవి మేనల్లుడైన సంతోషకుమారుడి ద్వారా డబ్బుకోసం బెంగపడ నక్కర్లేదని చెప్పించి - వెంటనే వందరూపా యిలూ పంపించి వేసింది. ఈ డబ్బు ఛటర్జీ మహాశయు డికి మరోపనికి ఉపయోగించింది.

కాని మాధవి అంత సులభంగా విడిచిపెట్టే మనిషి కాదు. కేవలం ఈ రెండెకరాలభూమి ఆధారంతో స్వర్గీ యుడైన మామగారికి భుక్తిగడిచేది కాదు. కనుక ఇంకా ఉండవలసిన భూమి అంతా ఎక్కడవుందో, ఎవరి అధీనంలో ఉందో అడిగిరమ్మని సంతోషుణ్ణి పంపించింది.

ఛటర్జీ మహాశయుడు, చాలా కోప్పడుతూ స్వయంగా వచ్చి, 'అదంతా విక్రయమైపోయింది. ఇంకా ఉన్న శాస్త్ మక్తాలో ఉంది. ఈ ఏడెనిమిది సంవత్సరాలనుంచీ జమీందారీ పన్ను చెల్లించకపోతే భూమిపుత్రా ఉండటం ఎలా సంభవం?' అన్నాడు.

ఈ శాస్త శిస్తు చెల్లించక పోవటానికి ఈ భూమిలో ఏమీ పండటంలేదా? నిజంగానే ఒకవేళ అమ్ముడు పోయి నట్లయితే, దాన్ని ఎవరు విక్రయించారో, ప్రస్తుతం ఆ భూమి ఎవరి ఆధీనంలో ఉందో, కనుక్కున్నట్లయితే నేను మళ్ళీ కొనటానికి ప్రయత్నించాలి. ఆ కాగితాలు గటా్రి ఎక్కడున్నాయి?' అన్నది మాధవి. ఛటర్జీ ఏదో సమాధానమైతే చెప్పాడుకాని, మాధవికి అది అర్థం కాలేదు. బ్రాహ్మడు లబలబలాడుతూ. తర్వాత ఏదోవాగి గొడుగు వేసుకుని, ఒక అంగవస్త్రం నడుముకు బిగించుకుని, జమీందారీ కచేరీఉన్న లాలతా గ్రామంకేసి ప్రయాణ మైనాడు. ఈ లాలతా గ్రామంలోనే సురేంద్రనాథుడి నివాసం మేనేజరు మధురబాబు దగ్గిరకువచ్చి, ఏడుస్తూ 'రక్షించాలి బాబూ! ఈ బీదబ్రాహ్మడు ఇంటింటికీ వెళ్లి బిచ్చమెత్తుకుని తినాల్సి వస్తుందనుకుంటాను' అన్నాడు.

ఇలా చాలామంది వస్తూఉంటారు! మధురబాబు ముఖం వెనక్కి తిప్పి 'ఏమి జరిగింది?' అన్నాడు.

'రక్షించుబాబూ!'

'ఏం జరిగి ది నీకు?'

విధుఛటర్జీ వెంటనే మాధవిఇచ్చిన వందరూపాయలూ

చేతులో పెట్టి 'మీరు ధర్మతారులు. మీరు రక్షించక పోతే నా సర్వస్వమూ పోతుంది' అన్నాడు.

'అబ్బా! విడమర్చి సరిగ్గా చెప్పు.

గోలాపూరులో రామతను సన్యాల్ విధవకోడలు. ఇన్నాళ్లయిపోయాక మళ్లీ ఇప్పుడుతిరిగివచ్చి, నా ఆస్తి అంతా దఖలుపర్చుకోవాలని ప్రియత్నిస్తోంది.'

మధురబాబునవ్వుతూ, – ఆమె నీ ఆస్తినంతా స్వాధీనం చేసుకోవాలంటోందా? లేకపోతేనువ్వు ఆమెఆస్తిని కాజెయ్యాలని చూస్తున్నావా? అన్నాడు.

బ్రాహ్మడు అప్పుడు మేనేజరుగారి చేతులురెండూ పట్టుకుని, గాయత్రినిస్పృశించి 'ఈ పది సంవత్సరాలనుంచీ సర్కారువారిశిస్తు నేనేచెల్లిస్తూ వస్తున్నాను' అన్నాడు.

'భూమిని అనుభవిస్తున్నప్పుడు శిస్తుచెల్లించ నక్కరలేదా?'

'రక్షించాలి తమరు–"

మధురబాబు ఆతడి ఉద్దేశ్యం స్పష్టంగా గ్రహించి - విధవను మోసపుచ్చాలనుకుంటున్నావా? అన్నాడు'

బ్రాహ్మడు మెదలకుండా చూస్తూ ఊరుకున్నాడు.

ఎన్ని ఎకరాలభూమి?'

'పాతికఎకరాలు'

మధురబాబు లెక్కవేసి' కనీసంమూడువేలరూపాయలు. జమీందారీగారి కచేరీకి నజరానా ఏమిస్తావు?"

"తమరుహుకుం ఇచ్చినంత-మూడువందలరూపాయలు

"మూడువందలిచ్చి మూడు వేల రూపాయల ఆస్తి

తీసుకుంటావా? మావల్ల ఏమీకాదు.'

బ్రాహ్మడు కన్నీళ్లుకారుస్తూ 'ఎన్ని రూపాయలు ఇవ్వమని ఆజ్ఞ? అన్నాడు.

'వెయ్యి రూపాయిలిస్తావా?'

తర్వాత ఇద్దరూచాలాసేపు రహస్యంగా ప్రసంగించు కున్నారు. చివరకు ఫలితమేమిటంటే – యోగేంద్రనాథుడి భార్య మాధవి మీద పదిసంవత్సరాల శిస్తు వడ్డీతోసహా వెయ్యిన్నర రూపాయలకు దావా పడింది. సమను జారీ చేశారు. కాని అది మాధవిదాకా రాలేదు. తర్వాత ఎక్స్‌పార్టీకి డిక్రీ అయింది నెలాపదిహేనురోజులయాక – శిస్తుబకాయికింద జమీందారు ఆమె ఆస్తినంతాఇల్లుతో సహావేలం వేయటానికి వేలంనోటీసు ఇచ్చి, జప్తుచేశారని– తెలిసింది. మాధవికి...మాధవి పొరుగింటి ఆవిడనుపిలిచి' మీదేశములో ఇది మొగలాయీ ప్రభుత్వమా?' అని అడిగింది.

'ఎందుకనో చెప్పు?'

'అదికాకపోతే మరేమిటి? ఒకవ్యక్తి మోసపుచ్చినా సర్వస్వాన్ని కాజెయ్యాలని చూస్తున్నాడు - మీరుచూడ టంలేదూ?'

"మేమేంచెయ్యగలం? జమీందారే వేలంవేయిస్తూంటే బీదవాళ్లం దానికి మేముయేంచెయ్యగలం?'

"నాఇల్లువేలం అవుతుంటే నాకు కబురుపంపవద్దూ? మీజమీంబారు ఎలాంటి వాడేమిటి?'

ఆమె అప్పుడుఅంతావివరంగా చెప్పింది. 'ఇలాప్రజలను

పీడించేజమీందారు, ఇంత అత్యాచారాలు చేశేవాడిని ఈజిల్లాలో ఇంతకుపూర్వమెప్పుడూ చూడలేమేము' అని పనిజలు ఆనోటా ఆనోటా చెప్పుకోగా విన్నమాటలు కూడా కొన్ని చెప్పింది.

'జమీందారుగార్ని స్వయంగా చూస్తేఏంపనిజరగదా?' అని భయపడుతూ, భయపడుతూ అడిగింది మాధవి. మేనల్లుడైన సంతోషకుమారుడి కోసం మాధవి అలాచేయటానికి కూడా సిద్ధమయింది. కాని ఆ పొరుగింటావిడ అప్పుడేమీ చెప్పలేకపోయింది. కాని రేపు తన అప్ప కొడుకు దగ్గిర అన్ని విషయాలు విపులంగా అడిగి తెలుసుకుని చెబుతానంది. ఆమె అప్పకొడుకు రెండుమూడుసార్లు లాలతా గ్రామం వెళ్లివచ్చాడు. అతడికి జమీందారుగారి సంగతులన్నీ తెలుసు. అంతేకాకుండా అతడు ఆరోజున తోటలోని మేడలోఉన్న ఎలోకేశి విషయమై జరిగిన సంగతికూడా వినిఉన్నాడు. తర్వాత అతడి పింతల్లి జమీందారుగారి దగ్గిర కెళ్లి రామతనుబాబు కోడలు కనిపించటం విషయమై ప్రశ్నించింది. అప్పుడతడు ముఖం వీలైనంత గంభీరంగాపెట్టి 'ఆమెవయస్సు ఎంత?' అని అడిగాడు.

'షుమారు ఇరవై - ఏళ్ళు ఉండవచ్చు' అన్నదామె.

అతడు తలఊగిస్తూ 'చూడటాని కెలా ఉంటుంది?' అని అడిగాడు.

'అప్సరసలా ఉంటుంది.'

అప్పుడతడు ముఖకవళిక మార్చి, 'చూస్తే పనికావచ్చు. కాని ఆమె ఈరాత్రి పడవమాట్లాడుకుని పుట్టింటికి

బయలుదేరితే మంచిదంటాను నేను' అన్నాడు.

'ఎందుకనిరా ?'

'ఇదే చెప్పావుగా – అప్సరసలా ఉంటుందని ?'

'అలాఉంటే ఏం ?'

'అందులోనే ఉంది అంతా. చూపులకు అప్సరసలా ఉంటే సురేన్‌రాయి జమీందారు దగ్గిరనుంచి తప్పించుకో లేరు.'

పింతల్లి నోరు నొక్కుకుని – 'అలా అంటా వేమిటి ? అంతే ?' అంది.

అతడు చిరునవ్వు నవ్వి 'ఆఁ అంతే- దేశమంతా తెలుసు ఈ సంగతి' అన్నాడు.

'అయితే చూడటం మంచిది కాదా?'

'ఏమాత్రంమంచిదికాదు'

'కాని ఆస్తి అంతా పోతోంది'

'ఛటర్జీమహాశయుడు ఎప్పుడైతే ఈ వ్యవహారంలో ఉన్నాడో, అప్పుడింక ఆస్తిమీద ఆశపెట్టుకోనక్కర్లా. ఆపైన అయినయింటిపిల్ల–నీతినికూడా పోగొట్టుకుంటుందా!

మర్నాడు ఆమె మాధవికి ఈ సంగతంతాచెప్పింది. ఆమెవిని కొయ్యబారిపోయింది. సురేన్‌రాయిజమీందారు మాటేఆమెరోజల్లా ఆలోచిస్తుకూర్చుంది. సురేన్‌రాయి ! పేరుచాలా పరిచితమైనట్లుంది. కాని అతనితో ఇతడు కలవటంలేదు. ఈపేరు ఆమెఎన్నోసార్లు తలచుకుంది— ఇప్పటికి ఐదుసంవత్సరాలక్రితం మరిచిపోయినపేరు మళ్లీ చాలా రోజులకు జ్ఞాపకంవచ్చింది.

ఆలోచనలతోనూ, కలలతోనూ ఆమె కా రాత్రి బహుకష్టంగా గడిచింది. పూర్వపు సంగతులన్నీ ఎన్నోసార్లు జ్ఞాపకం వచ్చాయి, ఎన్నోసార్లు కళ్లవెంబడి నీళ్లుకూడా వచ్చాయి. సంతోషకుమారుడు ఆమెముఖంకేసి భయభయంగాచూసి, 'అత్తా! నేను అమ్మదగ్గిరకు వెడతా' అన్నాడు. మాధవి తనుకూడా ఈవిషయం ఒకటిరెండు సార్లు ఆలోచించింది. ఎందుకు వెళ్ళకూడదు? ఇక్కడఉంటే ఇల్లు పోయింతర్వాత, ఇప్పుడింక కాశీవెళ్ళిఉండటంతప్ప గత్యంతరంలేదు. కాని సంతోషుడికోసం ఆమె జమీందారుని చూడాలనికూడా సంకల్పించుకుంది. కానిఅలాజరగలేదు. ఇరుగుపొరుగువారంతా అభ్యంతరపెట్టారు. అదీగాక ఇప్పుడోకొత్త ఆలోచనవచ్చి పడింది. అదిరూపయౌవనాల సంగతి?- 'పాడురాత! ఈఉత్పాతాలుఇంకాఈశరీరాన్ని అంటిపెట్టుకునేఉన్నాయా! అనుకుంది మాధవి. ఏడుసంవత్సరాలనుంచీఆమెకేవిషయం జ్ఞాపకంలేదు. జ్ఞాపకంచేసేవారుకూడా ఎవ్వరూలేరు. భర్త చనిపోయింతర్వాత పుట్టింటికి వెళ్లిందగ్గరనుంచీ అంతా 'బడదీదీ' అని పిలిచేవారు. అంతా 'అమ్మా' అని పిలిచేవారు. ఈఆదరపూర్వకమైన పిలుపులు ఆమె మనస్సును మరింత వృద్ధాప్యానికి తీసుకువెళ్ళాయి! ఈరూపయౌవనాలు బూడిదయిపోను! బడదీదీలాగా ఆమెపనులు చేయవలసివచ్చినప్పుడు- తల్లిలాగా ఆదరాభిమానాలు చూపవలసివచ్చినప్పుడు - ఈసంగతులన్నీ జ్ఞాపకముంటాయా! మరచిపోయింది- మళ్లీయిప్పుడు జ్ఞాపకంవచ్చాయి. అంచే

తనే ఆలోచనలు ప్రారంభమైనాయి. ప్రత్యేకించి ఈ యౌవనం సంగతే! సిగ్గుతో మలినంగా నవ్వుకుని- 'ఇక్కడి ప్రజలు అంధులా, పశువులా?' అనుకుంది. కాని మాధవి పొరపాటు పడింది- అందరి మనస్సులూ తనకులాగా ఇరవై రెండేళ్ళకే ముసలి మనస్సులు కావు!

మూడురోజులు గడిచాక జమీందారుగారి బంట్రోతు వచ్చి ఆమెగుమ్మానికి అడ్డంగా కూర్చుని, సురేన్ రాయ్ కొత్తగా సంపాయించిన ఈ కీర్తిగాథంతా ఊళ్ళో వాళ్ళందరికీ చిలవలు పలవలుగా చెప్పటం ప్రారంభించేసరికి మాధవి సంతోషకుమారుడి చెయ్యి పట్టుకుని, దాసీదాని వెనకాలే వెళ్ళి పడవలోకి ఎక్కి కూర్చుంది.

ఇంటికి దగ్గరలోనేనది. సోమరాపూర్ వెళ్ళాలని చెప్పింది పడవవాడితో ఒకసారి ప్రమీలను చూడటానికి వెళ్ళాలి.

గోలాపూర్‌కు ముప్ఫై మైళ్ళదూరంలో ఉన్న సోమరాపూర్‌లో ప్రమీలకు పెళ్ళి అయింది పదహారవ ఏటనుంచీ ఆమె అత్తవారింట్లో ఉంటోంది ఆమె బహుశా మళ్ళీ కలకత్తా వస్తుంది. కాని అప్పుడు మాధవి ఎక్కడుంటుందో? అంచేత ఇప్పుడే ఒక్కసారి వెళ్ళాలి.

సూర్యోదయం కాగానే పడవవాళ్ళు పడవనునదిలారు. ప్రవాహానికి ఎదురుగాపోతుంది పడవ గాలికూడా ఎదురు గాలి. అంచేత ఆచిన్నపడవ మెల్లి మెల్లిగా వెదురుచెట్ల మధ్యలోంచి చువ్వలను ముళ్ళను తప్పించుకుంటూ పోతోంది. సంతోషకుమారుడి సంతోషం పట్టశక్యం

కాకుండావుంది. వాడు పడవలోనికి వాలుతున్న వెదురు బెత్తాలను అందుకుని విరవటంలో నిమగ్నుడైనాడు. 'గాలినిలబడకపోతే రేపుమధ్యాన్నందాకా పడవ సోమరాపూర్ చేరుకోలేదు.' అన్నారు పడవవాళ్లు.

ఇవాళ మాధవికి ఏకాదశికాని సంతోషకుమారుకోసం ఎక్కడైనా పడవను ఆపి, వాడికి వంటచేసిపెట్టాలి. 'పాడాగంజ్‌లో పడవను కట్టేస్తే సదుపాయంగా ఉంటుంది. అక్కడ అన్ని వస్తువులూ దొరుకుతాయి' అన్నారు పడవవాళ్లు.

'అలాగే చెయ్యి బాబూ! పదిపదకొండులోపల నయినా కుర్రవాడు భోజనం చెయ్యాలి.' అన్నది దాసీది.

## ౯

కార్తీకమాసం వెళ్లిపోతోంది. కొంచెం చలికూడా మొదలెట్టింది. సురేంద్రనాథుడు మేడమీది గదిలో ఉన్నాడు. కిటికీచువ్వల్లోంచి పాత్రిసూర్యుని వెలుతురు లోపలపడుతూంటే ఎంతో మనోహరంగావుంది. కిటికీదగ్గరగా టేబిల్ ముందర కూర్చుని, సురేంద్రనాథుడు కాగితాలు వగైరాతీసుకుని, ఆదాయం, వసూళ్లు, బకాయీలు, జమాఖర్చు, అర్జీలు-తీర్పులు, అన్నీ వరసగా ఒకొక్కటే తిరగవేస్తున్నాడు. ఇవన్నీ చూచుకోవటం ఒకవిధంగా తప్పనిసరి అయిపోయింది. లేకపోతే కాలంకూడాగడవదు. శాంతితో ఈవిషయమై పోట్లాటకూడాఅయింది. అక్షరాల

వంకచూస్తే మానవుడుకి గుండె నెప్పిఎక్కువ కాదనీ ఖల వంతంమీద అతణ్ణి అక్కణ్ణుంచి బైటికి తీసుకువెళ్లటంవల్ల ఆపేవప్రయోజనం ఉండదని ఎన్నోవిధాలచెప్పి శాంతిని ఒప్పించాడు. గత్యంతరంలేక శాంతి ఇందుకు అంగీకరించి, ఆవశ్యకమైన సహాయంకూడా చేస్తోంది.

ప్రస్తుతం ఆమెకు భర్తమీద కావలసినంత అధికారం. ఆమెమాట ఒక్కయిటనా చెప్పక పోవటమంటూ చెల్లక పోవటమంటూ ఏనాడూ లేదుఅసలు. కాని అయిదారుగురు దౌర్భాగ్య స్నేహితులు చేరిన ఆకొన్నాళ్లుమాత్రం శాంతి కొంచెం దుఃఖపడాల్సి వచ్చింది. భార్య ఆదేశానుసారం సురేంద్రుడు గుమ్మంకదలటంకూడా మానేశాడు. డాక్టరు గారి సలహాను, ఉపదేశాన్ని శాంతిప్రాణప్రదంగా పాటిం చటానికి తగినవేర్పాట్లు చేసింది.

ఇంతకుమునుపే ఆమె దగ్గరకూర్చుని, రంగుతాళ్లతో కొన్ని కాగితాలు కట్టలుకట్టింది. సురేంద్రనాథుడు ఒక కాగితంచూస్తూ తలఎత్తి హఠాత్తుగా 'శాంతీ!' అని పిలిచాడు.

శాంతి ఇంతలో ఎక్కడకో వెళ్లింది_ మళ్లీ వెంటనే తిరిగి వచ్చి 'పిలిచారా?' అంది.

'ఆఁ' నేను ఒకసారి కచేరీకి వెళ్లాలి.'

'వద్దు. ఏంకావాలో చెప్పండి. నేను తీసుకువచ్చిఇస్తా!'

'ఏమీ అక్కర్లా. కాని ఒకసారి మథురబాబునుచూడాలి'

'అతడికి కబురు పంపుతాను. మీరు వెళ్లవద్దు. కాని ఇప్పుడు ఆయనెందుకు?'

'వచ్చేనెలనుంచీ ఆయనింక పనిలోకి రానక్కర్లేదని చెప్పేసాను.'

శాంతి విస్మితురాలైంది. అయినా సంతోషపడి 'ఆయన అపరాధమేమిటి?' అని అడిగింది.

'అపరాధం ఫలానా అని స్పష్టంగా చెప్పలేను. కాని చాలామితిమీరిన పనులు చేస్తూన్నాడు' అని కచేరీకి సంబంధించిన కాగితాలు చూపిస్తూ' ఇవిచూడు గోలా పూర్‌లో ఒకవితంతువు ఇల్లూవాకిలీ సమస్తమూచాటుగా వేలం వేయించికొనేశాడు నన్ను ఒక్కసారైనా అడిగిన పాపానపోలేదు.' అన్నాడు.

శాంతి నొచ్చుకుని_ 'పాపం వితంతువా? అయితే అది మంచి పనికాదు, కానివేలం ఎందుకువేశాడు?' అన్నది.

'పది సంవత్సరాలశిస్తు బాకీఉంది. వడ్డీతోసహా పది హేనువందల రూపాయలకు దావాపడింది.'

డబ్బుసంగతివినేసరికి శాంతి మధుబాబు విషయంలో కాస్త మెత్తపడి, చిరునవ్వు నవ్వుతూ 'అది మేనేజరుతప్పు ఏమిటి? అంతడబ్బుఎలావిడిచిపెట్టటం?' అంది

సురేంద్రనాథుడు పరధ్యానంలో ఏదో ఆలోచించ నాగాడు. 'అంతడబ్బువదలి వెయ్యాలిసిందేనా?' అని శాంతి మళ్లీ అడిగింది.

'వదలకపోతే ఎలా! నిస్సహాయురాలైన విధవను ఇంట్లోంచి వెళ్లగొడతారా? నువ్వుసలహా ఏమనియిస్తావ్?'

ఆమాటల్లో అంతర్యంగా ఉన్న అగ్నిజ్వాల ఆమెశరీ రానికిసోకింది. అప్రతిభురాలై నొచ్చుకుంటూ. 'ఇంట్లోంచి

వెళ్ళగొట్టమని చెప్పలేను నేను. మీడబ్బు మీరు దానం చేస్తే, దానికి నేనెందుకు అడ్డుపడతాను?' అంది.

సురేంద్రుడు నవ్వుతూ, 'అదికాదు శాంతీ! నా డబ్బు నీదికాదా? కాని ఈ మాటలు చెప్పిచూస్తాను. నేను లేనప్పుడు నువ్వు–"

'అవేం మాటలండీ?'

'నాకిష్టమైన పనులు చెయ్యవా నువ్వు?'

శాంతికి కళ్ళవెంబడి నీళ్ళువచ్చాయి. ఎందుకు చెయ్యను. భర్తశరీరారోగ్యంకూడా బాగుండలేదు. 'అట్లాంటిమాటలెందుకు చెప్పండి?' అంది.

'నాకుచాలా బావుంటాయి అందుకనే అట్లా అంటు న్నాను, నువ్వు నామాటలు నా కోరికలను తెలుసుకొని నిర్వర్తించవా శాంతీ!'

శాంతికళ్లకు పమిటచెంగు అడ్డంపెట్టుకొని తలతిప్పింది. సురేంద్రుడు కాస్సేపాగి 'మా బడదీదీపేరు' అన్నాడు మళ్ళీ శాంతి కళ్లమీదనున్న చెంగు తీసేసి అతడికేసి చూసింది.

సురేంద్రుడు ఒక కాగితం చూపించి 'ఇది చూడు, మా బడదీదీపేరు' అన్నాడు.

'ఎక్కడ?'

'ఇదుగో చూడు, మాధవీదేవి - ఈమె ఇల్లు వేలం వేశారు'

శాంతి ఒక్క నిమిషంలో అనేక సంగతులు గ్రహించింది. 'అంచేత మళ్లీ అంతా ఆమెకు ఇచ్చివెయ్యాలను

కంటున్నారా?' అని అడిగింది.

సురేంద్రుడు కొంచెం నవ్వి, 'అందుకనే తప్పకుండా ఇచ్చేస్తా, సమస్తమూ – సర్వమూ ఇచ్చేస్తా–' అన్నాడు.

మాధవి విషయంలో శాంతి కొంచెం దుఃఖితురాలైంది మనస్సులో కొంచెం అసూయకూడా కలిగిందల్లే వున్నది. ఆమె బహుశా మీ బడదీదీ కాదేమో మాధవి అనే పేరు మాత్రం ఉంది.

పేరుకే ఇంత ఇదా!' అన్నది.

'బడదీదీ పేరును కాస్తయినా గౌరవించలేనా?'

'అలాగే గౌరవించండి. కాని ఆమె స్వయంగా ఏమీ తెలుసుకోలేదేమో!'

'ఆమె తెలుసుకోదని నేను అగౌరవపరచగలనా?'

'ఇలాంటి పేరు లోకంలో ఎంతోమందికి ఉంటుంది'

'ఉంటుంది. నువ్వు దుర్గ నామంవ్రాసి దాన్ని కాలితో తొక్కగలవా?'

'ఛీ! అవేంమాటలండీ? దేవతలపేర్లు తీసుకొచ్చి—'

సురేంద్రనాథుడు ఫక్కున నవ్వి 'దేవతల పేర్లు తీసుకు రాను. కాని నీకు నేను అయిదువేల రూపాయలిస్తాను— మరి ఒకపని చెయ్యగలవా?' అన్నాడు.

శాంతి సంతోషంతో 'ఏంపని?' అంది.

గోడమీద సురేంద్రనాథుడి ఫొటో ఒకటి ఉంది. ఆ ఫొటోకేసి చూపిస్తూ ఈ ఫొటో—

'ఏమిటి?,

'నలుగురు మనుష్యులచేత పట్టించుకెళ్లి తగలబెట్టించు'

'దగ్గరలో పిడుగుపడితే ముందు మనుష్యులలోనిరక్తం పీల్చుకుపోయినట్లు—సర్పదష్టమైన వాని ముఖం నల్లబడి నట్లు శాంతిముఖం కూడా నల్లపడింది. తర్వాత మళ్ళీ క్రమ క్రమంగా ముఖంలోకి, కళ్ళల్లోకి కొంచెం నెత్తురువచ్చింది.

తర్వాత కరుణాదృష్టితో భర్తముఖంకేసి చూస్తూ నిశ్శబ్దంగా క్రిందికి దిగి వెళ్లిపోయింది. పురోహితుణ్ణి పిలి పించి, శాంతి విధులు యథావిధిగా చేయించటానికి ఏర్పా టు చేయించి, మనస్సులో, ఈ బడదీదీ ఎవరైనా కానీ, ఆమెను గురించి ఇంకేమీ అనకూడదని ప్రతిజ్ఞచేసుకుంది. తర్వాత గదిలోకివెళ్ళి చాలాసేపు కన్నీరు కార్చింది. ఇంత కటువైన మాటలు జీవితంలో ఎన్నడూ వినలా ఆమె.

సురేంద్రబాధురు కాస్సేపు మెదలకుండా కూర్చుని, తర్వాత కచేరీలోకి వెళ్ళి, మధురబాబు కనపడగానే 'గోలా పూర్‌లో ఎవరి ఆస్తి వేలం వేసింది?' అని అడిగాడు ముందుగా.

'చచ్చిపోయిన రామతను సన్యాయి విధవ కోడలిది.'

'ఎందుకు?'

'పది సంవత్సరాల శిస్తు బాకీ ఉంది.

'ఏదీ ఖాతా చూపించు?'

మధురబాబుకి మొదట్లో మతిపోయింది. తర్వాత— 'ఖాతా పుస్తకాలూ వగైరా ఇంకా 'పాబనా' నుంచి రాలేదు' అన్నాడు.

'తీసుకురావటానికి మనిషిని పంపు. ఆ విధవకు నిలవటా నికి నీడయినా ఉందా?'

'లేదనుకుంటాను!'

'అయితే మరి ఎక్కడుంటుంది?'

మథురనాథబాబు సాహసం తెచ్చుకుని 'ఇన్నాళ్ళూ ఎక్కడుందో బహుశా ఇప్పుడూ అక్కడే ఉంటుందను కుంటాను' అన్నాడు.

'ఇన్నాళ్లూ యెక్కడ వున్నది?'

'కలకత్తాలో — ఆమె తండ్రి ఇంటిదగ్గర.'

'తండ్రిపేరేమిటో తెలుసా?'

'తెలుసు. వ్రజరాజలాహిడీ'.

'విధవ పేరు?'

'మాధవీదేవి'.

సురేంద్రనాథుడు తలవంచుకుని అక్కడే చతికెలపడ్డాడు మథురనాథబాబు గాబరాపడుతూ 'ఏమయింది?' అని అడిగాడు. సురేంద్రనాథుడు ఆమాటకు సమాధానం చెప్ప కుండా ఒక నౌకర్ని పిలిచి, 'ఒక మంచి గుర్రానికి జీనువేసి సిద్ధంగా ఉంచమని చెప్పు. నేనిప్పుడే గోలాపూర్ వెడ తాను. ఇక్కడినుంచి గోలాపూర్ ఎంత దూరమో తెలుసా?' అన్నాడు.

'షుమారు ఇరవై మైళ్ళు.'

'ఇప్పుడు తొమ్మిది గంటలయింది. ఒంటిగంటలోపుగా వెళ్ళగలనా?' గుర్రంరాగానే దానిమీద ఎక్కికూర్చుని 'ఎటువైపు?' అని అడిగాడు.

'ముందు ఉత్తరంగా వెళ్ళి, తర్వాత పశ్చిమ దిక్కుకు మళ్ళాలి'.

గుర్రం కొరడా దెబ్బతో పరుగుతీసింది.

ఈసంగతివిని శాంతి పూజాగృహంలోకి వెళ్ళి తలరక్తం స్రవించేటట్లు నేలకేసికొట్టుకుని 'ప్రభూ! ఇదేనా నీవాంఛ! నా భర్తను మళ్ళీ పొందగలనా?' అని ఏడ్చింది

తర్వాత ఇద్దరు రౌతులు గుర్రాలెక్కి గోలాపూర్ కేసి పరుగుతీశారు. కిటికీలోంచి వాళ్లను చూస్తూ శాంతి క్రమంగా కళ్లు మూసుకుని – తల్లీ మహాభవానీ! రెండు వేటలు బలిఇస్తాను. ఏదికావాలంటే అది ఇస్తాను. వానిని తిరిగి నాకియ్యి. హృదయంచీల్చి కావలసినంత రక్తం ఇస్తాను. తల్లి నువ్వు కోరినంత – నీ పిపాస తీరేటంత రక్తమిస్తా' అని ప్రార్థించింది.

గోలాపూర్ ఇంకా నాలుగుమైళ్ళుంది. గుర్రం గిట్టల వరకు నురుగులు కక్కుతోంది. దుమ్ము రేపుతూ, చెమటలు కారుస్తూ గుర్రం పరుగెత్తుతోంది. నెత్తిమీద మిటమిట లాడే సూర్యుడు.

గుర్రంమీద కూర్చున్నా సురేంద్రుడు శరీరం ఉడుకెత్తి పోతోంది. లోపల నరాలన్నీ పైకి ఉబ్బుకు వస్తున్నట్లున్నాయి. తర్వాత భళ్ళున రెండుమూడుసార్లు రక్తవాంతి చేసుకున్నాడు. ఆ రక్తం దుమ్ముకొట్టుకున్న గుడ్డలనిండా పడింది. సురేంద్రుడు చేతో మూతితుడుచుకున్నాడు. ఒంటిగంట లోపలనే గోలాపూర్ వెళ్ళి చేరుకున్నాడు. రోడ్డుప్రక్కన ఉన్న దుకాణంలో 'ఇదేనా గోలాపూర్?' అని అడిగాడు.

'ఆఁ.'

'రామతను సన్యాల్ ఇల్లెక్కడ?'

'అటువైపు.'

మళ్ళీ గుర్రం పరుగుతీసింది. కాస్సేపట్లో తాను కోరు కున్న ఇంటిదగ్గరకు వచ్చి నిలబడ్డాడు.

గుమ్మంలో ఒక బంట్రోతు కూర్చుని వున్నాడు. జమీందారు ప్రభువుని చూడగానే నమస్కరించాడు.

'ఇంట్లో ఎవరున్నారు?'

'ఎవ్వరూ లేరు.'

'ఎవరూ లేరూ? ఎక్కడకు వెళ్ళారు?'

'ప్రొద్దున్నే పడవచేసుకుని వెళ్లిపోయారు.'

'ఎక్కడకి? ఎటుకేసి ...?'

'దక్షిణం వైపుకేసి.'

'నది ఒడ్డునే దారివుందా? గుర్రం పరుగెత్త గలదా?'

'చెప్పలేను. బహుశా దారిలేదనుకుంటా.'

మళ్ళీ గుర్రం పరుగెత్తింది. నాలుగు మైళ్ళు వచ్చేసరికి ఇంక గుర్రం నడిచేదారి లేదు. గుర్రాన్ని అక్కడ వదిలేసి సురేంద్రుడు కాలినడకను బయలుదేరాడు. ఒక్కసారి శరీర మంతా చూసుకునేసరికి బట్టలనిండా రక్తపుచింకులు — దుమ్ముకొట్టుకుని ఉన్నాయి. పెదవులనుంచి ఇంకా రక్తం స్రవిస్తోంది. నదిలోదిగి దోసిలినిండా నీళ్లుతాగాడు. తర్వాత శక్తికొద్దీ పరుగెత్తటం ప్రారంభించాడు. కాళ్ళకు చెప్పులు లేవు - శరీరంనిండా దుమ్ము. రక్తపుడాగులు. అతడిగుండెల మీాద ఎవరో రక్తం చల్లినట్లుఉంది.

ప్రొద్దుబాగా వాలిపోతోంది. కాళ్లు సాగటంలేదు.

ఈసారి ఒక్కమాటు శరీరం వాల్చకలిగితే జన్మకి సరిపోయే టంత నిద్రపోవచ్చు. అంచేతనే - అంతిమశయ్యపై ఈ జీవితానికి మహావిశ్రాంతి లభిస్తుంది అని ఆశతోనే అతడు ఉన్మత్తుడిలాగా పరుగెత్తుతున్నాడు.

ఈ శరీరంలో ఉన్న శక్తినంతా వినియోగించి సుఖంగా అంతిమ శయ్యను ఆశ్రయిస్తాడు. ఇంక లేవడు మళ్లీ!

నదిమలుపులో - అది పడవకాదూ? ఉప్పర్లుకట్టలుతవ్వి పోస్తూ దారి బాగు చేస్తున్నారు. సురేంద్రుడు 'బడదీదీ' అనిపిలిచాడు. గొంతు ఎండిపోవటంవల్ల మాట బైటకి రాలేదు. రెండు మూడు నెత్తురుచుక్కలుమాత్రం బైటికి వచ్చాయి.

'బడదీదీ' మళ్లీ రెండు మూడు రక్తపుబిందువులు...

ఉప్పరివాళ్ళు పడవను ఆపించారు. సురేంద్రుడు దగ్గ రకువచ్చి, మళ్లీ "బడదీదీ!' అని పిలిచాడు.

రోజుల్లా ఉపవాసం ఉండటం మూలంగానూ' మనస్సంతా దిగులుగాఉండటంవల్లనూ మాధవి నిర్జీవురాలిలాగా సంతోషకుమారుడి పక్కన కళ్ళుమూసుకుని పడుకుని ఉంది. హఠాత్తుగా ఆ పిలుపు చెవునపడింది. పూర్వపరిచితమైన కంఠంతో ఎవరోపిలుస్తున్నారల్లేఉన్నది! మాధవి లేచికూర్చుని లోపలనుంచి తల బైటికి పెట్టి చూచింది. శరీరమంతా దుమ్ము కొట్టుకొని ఉంది - మాష్టరుగారు కాదూ?

'దాసీ! పడవవాళ్లతో పడవను చప్పున ఒడ్డుకు పట్టమని చెప్పు' అంది.

సురేంద్రనాథుడు మెల్లిమెల్లిగా ఒడ్డుమీద మేను వాల్చాడు. అందరూ కలిసి సురేంద్రనాథుణ్ణి అతిప్రయత్నం మీద నావలోనికి ఎక్కించారు. ముఖంమీద కళ్లమీద నీళ్ళుకొట్టారు. ఒక పడవవాడు గుర్తుపట్టి, లాలతాపురం జమీందారు అన్నాడు మాధవి 'ఇష్టకవచం' ఉన్న బంగారపు గొలుసు మెల్లొంచితీసి ఆపడపవాడి చేతులో పెట్టి. 'లాలతాపూర్ ఈరాత్రికే తీసుకువెళ్లగలరా? మీకందరకు ఇలాంటి బంగారపు గొలుసు ఒక్కొక్కటి ఇస్తాను-' అన్నది.

బంగారపు గొలుసుచూసి, వాళ్లలో ముగ్గురుదిగి పడవతాడు భుజాన వేసుకున్నారు.

'వెన్నెలరాత్రి. తెల్లవారకముందే తీసుకెళ్లి చేరుస్తాం' అన్నారు

చీకటిపడ్డాక సురేంద్రుడికి స్మృతి వచ్చింది కళ్ళుతెరిచి మాధవి ముఖంకేసి చూస్తూ పడుకున్నాడు. మాధవి తలమీద ఇప్పుడు అవగుంఠనములేదు. శిరస్సుమీదకొంత భాగంమాత్రం చీరచెరగు కప్పిఉంది. సురేంద్రుడి శిరస్సు ఒళ్లో పెట్టుకుని కూర్చుని ఉంది మాధవి. కొంతసేపు అలా చూసి చూసి 'నువ్వు బడదీదీవా?' అన్నాడు.
చీరచెంగుతో మాధవి అతడి పెదవిమీది రక్తపుబిందువులను తుడిచి. తర్వాత తన కళ్ళు తుడుచుకుంది.

'నువ్వు బడదీదీవా?'

'నేను మాధవిని.'

సురేంద్రుడు కళ్ళుమూసుకుని మెల్లిగా 'ఆఁ అదే!' అన్నాడు.

ప్రపంచంలోని విశ్రాంతి యావత్తూ ఆమె ఒడిలోనే దాగిఉన్నట్లుంది. ఇన్నాళ్లకు సురేంద్రనాథుడు ఆవిశ్రాంతిని వెదకి పొందగలిగాడు. పెదవులచివరకి రక్తపుబిందువులతో పాటు చిరునవ్వుకూడా వచ్చింది— 'బడదీదీ! ఎంతబాధ!' అన్నాడు.

నీళ్ళు గలగలచప్పుడుచేస్తూ పడవ పరుగెత్తుతోంది. పడవపైకప్పులోంచి చంద్రకిరణాలు సురేంద్రుడి ముఖం మీాద పడ్డాయి. దాసీది చిరిగిపోయిన వినసకర్ర దీసుకుని విసురుతోంది 'ఎక్కడికి వెడుతున్నావ్?' అని సురేంద్రుడు మెల్లిమెల్లిగా అడిగాడు.

మాధవి భగ్నకంఠంతో 'ప్రమీాల అత్తవారింటికి." అన్నది.

'ఛీ! ఇలాంటిస్థితిలో బంధువుల ఇంటికి వెళ్లి ఉంటావా దీదీ! అన్నాడు సురేంద్రుడు.

౧౦

తన మేడలో - తను పడుకునే గదిలో బడదీదీ ఒళ్ళో తలపెట్టుకుని, సురేంద్రనాథుడు మృత్యుశయ్యమీాద పడుకుని ఉన్నాడు. కాళ్ళు రెండూ శాంతి ఒళ్ళో పెట్టుకుని కన్నీళ్లతో కడిగివేస్తోంది. పాబనాలో ఉన్న డాక్టర్లూ, ఆయుర్వేద వైద్యులూ అంతా కలిసి ప్రయత్నించికూడా రక్తవాంతిని కట్టించలేక పోయారు. అయిదు సంవత్సరాల క్రిందట తగిలిన దెబ్బవల్లనే ఇప్పుడు రక్తం కక్కుతున్నాడు.

మాధవి అంతర్యంలో ఏముందో నేను స్పష్టంగా చెప్పలేను. నేనూ సరీగ్గా ఎరగను. అయిదు సంవత్సరాల క్రితం

సంగతే ఆమెకే జ్ఞాపకం వచ్చిందనుకుంటాను. ఇంట్లోంచి ఆమె అతణ్ణి వెళ్ళగొట్టింది - కాని మళ్ళీ తీసుకురాలేక పోయింది. అయిదుసంవత్సరాలయాక సురేంద్రనాథుడు మాత్రం ఆమెను మళ్ళీ తీసుకువచ్చాడు.

చీకటిపడ్డాక ఉజ్జ్వలమైన దీపకాంతిలో సురేంద్రనాథుడు మాధవి ముఖంకేసిచూశాడు. కాళ్ళదగ్గిర శాంతి కూర్చుని ఉంది ఆమె ఎక్కడ వినిపోతుందో అని కాబోలు, మాధవి ముఖాన్ని చేత్తో తన ముఖందగ్గిరకు లాక్కుని, 'బడదీదీ! నన్ను ఆరోజున ఇంట్లోంచి వెళ్ళగొట్టిననాటి సంగతి జ్ఞాపకముందా? నిన్నిప్పుడు ఇంట్లోంచి వెళ్లగొట్టి దానికే ప్రతీకారం చేశాను. బదులుకు బదులు తీరిపోయిందా?' అన్నాడు.

ఒక్క నిమిషంలో మాధవి చైతన్యం కోల్పోయి, తల తిరిగి, సురేంద్రుడి ప్రక్కన పడిపోయింది. మళ్ళీ తెలివి వచ్చేసరికి ఇల్లంతా ఏడుపులతో ప్రతిధ్వనిస్తోంది.








# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| పుస్తకం సంఖ్య | TPLA131B192 |
|---|---|
| పుస్తకం పేరు | బడదీదీ |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 87 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Apsar |
| పేజీలు విడదీసినది | thasin |
| స్కాన్ చేసినది | Ch. Ramya |
| పరీక్ష చేసినది | HASEEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |